# MIKIE COMES TO YOUR TOWN




Collect nine wrappers' of MIKIE'S Royal Range of Chocolates. Write a slogan on why you love MIKIE Chocolates within 15. words. Fill up the coupon, attach it with the nine wrappers and hand it over to the shop where you bought the MIKIE Chocolates. The best entries would win lovely prizes. Hurry up! Make as many entries as you wish. With 9 wrappers for each entry. But make sure they reach us before the 15th of August.



First Prize One Bajaj Sunny



Second Prize One Mofa



Third Prize Five BSA SLR Cycles



Consolation Prize T. Shirts



Fourth Prize Three BSA Champ Cycles




Please write a slogan within 15 words why you like Mikie Chocolates

______________________________

______________________________

______________________________

NAME and ADDRESS (IN BLOCK LETTERS)

Name.......................................... Address:

Std.......................................... ..........................

School.......................................... ..........................

## Mikie Orient Confectioneries

74, PANTHEON ROAD, HARDEVI CHAMBERS, IIND FLOOR, EGMORE, MADRAS-8.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'     సంచాలకుడు : నాగిరెడ్డి

## మరింత అందమైన ప్రపంచం!

మనం నివసించే ప్రపంచాన్ని మరింత అందంగా తీర్చిదిద్దడం ఎలాగా అని ప్రతి మనిషీ ఆలోచించాలి. ప్రపంచం అంటే కేవలం నేలా నింగీ, కొండలూ కోనలూ, నదులూ సముద్రాలూ నిండిన ఈ భూగోళం మాత్రమే కాదు. భూమి మీది చెట్టూ-చేమా, పక్షులూ-జంతువులూ అన్నిటినీ కలిపి ప్రపంచం అంటున్నాము.

సృష్టిలో అన్నిటికన్నా విలక్షణమైనవాడు మనిషి. ఎందుకంటే మరే ప్రాణికీ లేని విశిష్టమైన ఆలోచనాశక్తి మనిషికి ఉన్నది. మంచి చెడుల మధ్యగల తారతమ్యాలను గ్రహించగల విచక్షణాజ్ఞానం మనిషికి మాత్రమే ఉన్నది. మంచి మాటలతో, చేతలతో తనకూ తన చుట్టూవున్న సమాజానికీ శాంతి సౌఖ్యాలను సమకూర్చుకోగల అద్భుతమైన శక్తి మనిషికి ఉన్నది.

మనిషి జీవితంలో మనసు ప్రధానమైన పాత్ర వహిస్తుంది. అందుకే—మనకు జరిగే మేలుకూ, కీడుకూ మన మనసే కారణం అనీ, మంచి మనసుకు మించిన సంపద లేదనీ పెద్దలు అన్నారు.

ప్రపంచాన్ని మరింత అందంగానో, అందవిహీనంగానో మార్చ గల మహత్తరశక్తి మనిషి ఆలోచనలకు ఉన్నది. మనమూ హాయిగా జీవిస్తూ, మన పొరుగువారినీ సుఖసంతోషాలతో జీవించేలాగా చేయా లన్న ఉన్నత ఆశయంతో మన జీవితాలను మలుచుకున్నట్టయితే ప్రపంచం మరింత అందంగా తయారవుతుంది!

సంపుటి 90     మే '92     సంచిక 5

విడి ప్రతి : 4-00     సంవత్సర చందా : 48-00





# మారిషస్‌లో నూతన అధ్యాయం

ఇంగ్లాండు రాణి, ఇప్పుడు మారిషస్ దీవి ప్రభుత్వానికి నాయకురాలు కాదు. గత మార్చి 12వ తేదీ మారిషస్ దీవి ఇంగ్లీషు రాచరిక నం॥ ప్రధానమంత్రి పదవిని చేపట్టిన అనిరూధ్ జగన్నాథ్—మారిషస్ దీవిని 'రిపబ్లిక్' చేయాలని ప్రతిజ్ఞబూనాడు.





వ్యవస్థకు వీడ్కోలుపలికి, పరిపూర్ణ రిపబ్లిక్ దేశంగా మారింది. అది ఇప్పుడు మన దేశం లాగే బ్రిటిష్ 'కామన్వెల్త్'లో సభ్యదేశంగా కొనసాగుతుంది.

సరిగ్గా 24 సంవత్సరాల క్రితం అంటే—1968వ సం॥ మార్చి 12వ తేదీ మారిషస్, బ్రిటిష్ పరిపాలన నుంచి స్వతంత్రం పొందింది. అయితే అప్పటినుంచి ఇంగ్లాండు రాణి తన ప్రతినిధిని గవర్నర్ జనరల్‌గా నియమించేది.

మారిషస్ 'జాతిపిత'గా పేరు గాంచిన సర్ శివుసాగర్ రామ్‌గులామ్ మొట్టమొదటి ప్రధాన మంత్రి అయ్యారు. ఆయన తరవాత 1982వ

1983వ సం॥లో సర్ శివుసాగర్ గవర్నర్ జనరల్ అయ్యాడు. ఆ పదవిని అలంకరించిన మొట్టమొదటి బ్రిటిషేతరుడు ఆయనే. ఆయన 1985లో మరణించడంతో సర్ వీరాసామి రింగాడూ గవర్నర్ జనరల్ అయ్యాడు.

1987వ సం॥లో జరిగిన ఎన్నికల తరవాత జగన్నాథ్, మిశ్రమ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశాడు. ఆయన ప్రధానమంత్రిగా కొనసాగుతూ సర్ వీరాసామికి అధ్యక్ష పదవి నిచ్చాడు. నూతన రిపబ్లిక్ రాజ్యాంగచట్టాన్ని భారతదేశం నమూనాలోనే రూపొందిస్తారు. అయితే పార్లమెంటు ఒకే సభను మాత్రమే కలిగి వుంటుంది.

1865 చ. కి. మీ. వైశాల్యం గల మారిషస్ దీవి, హిందూమహాసముద్రంలో, ఆఫ్రికా తీరసమీపంలో వున్న మడగాస్కర్ దీవికి తూర్పుదిశలో ఉన్నది. దీనిని మొట్టమొదట 10 వ శతాబ్దంలో అరబ్ నావికులు కనుగొన్నారని చెబుతారు. ఆ పిమ్మట 6 శతాబ్దాల అనంతరం పోర్చుగీసులూ, 16 వ శతాబ్దాంతంలో డచ్‌వాళ్ళూ అక్కడికి వచ్చారు. డచ్‌వాళ్ళు అక్కడ వ్యవసాయం చేపట్టి, ఆ దీవిని వర్తక వ్యాపారాలకు ఉపయోగించుకుని, వంద సంవత్సరాల తరవాత దానిని వదిలిపెట్టారు. ఆ తరవాత అది ఫ్రాన్స్ ఆధిపత్యంలోకి వచ్చింది. 1810 లో దానిని బ్రిటిష్‌వాళ్ళు చేపట్టారు. ఆ తరవాత దాదాపు ఒకటిన్నర శతాబ్దానంతరం స్వతంత్రం పొందేంతవరకు అది బ్రిటిష్ అధికారానికి లోబడిన ప్రాంతంగానే ఉండేది.

ఈ దీవి జనాభా దాదాపు 11 లక్షలు. ఇందులో 68 శాతం మంది భారత జాతీయులు. ఇంగ్లీషు ఫ్రెంచి అధికార భాషలు. తమిళం, హిందీ, గుజరాతీ, ఉర్దూ, భోజపురి మాట్లాడేవాళ్ళున్నారు. మారిషస్ దీవి చుట్టూ చిన్న చిన్న దీవులు చాలా వున్నాయి. ప్రతి దీవిలోనూ—శివుడు, గణపతి, సుబ్రహ్మణ్యేశ్వర ఆలయాలు ఉన్నాయి. యేటా 'తైపూసం కావడి' 'చిత్తిరై కావడి' ఉత్సవాలు నాదస్వర మంగళ వాయిద్యాలతో ఘనంగా జరుగుతాయి. మహాశివరాత్రి, హెూళీ, దీపావళి మొదలైన పండుగలను కూడా జరుపుకుంటారు.

పర్యాటకులు ఈ దీవిని 'హిందూమహా సముద్రంలోని ముత్యాలసరం' అని మెచ్చుకుంటారు. పచ్చటి చెట్టు చేమలతో, రకరకాల పువ్వులతో ఈ దీవి భూతలస్వర్గంలా కనిపిస్తుంది. అందుకేనేమో సుప్రసిద్ధ అమెరికా రచయిత మార్క్‌ట్వైన్ (1835–1910) ఇక్కడి ప్రకృతి సౌందర్యాన్ని చూసి పరవశం చెంది, "దేవుడు మారిషస్‌ను చూసి, స్వర్గాన్ని సృష్టించాడు!" అని అన్నాడు.





# అత్త-కోడలు

సీతాపురంలో శ్రీకంఠుడు పేరున్న వ్యాపారి. అతడికి ఇద్దరు సంతానం— శ్రీనాధుడు, శ్రీవల్లి. శ్రీనాధుడు యుక్త వయస్సు వచ్చేసరికి, వ్యాపారంలో తండ్రికి కుడిభుజంగా వుంటూ వచ్చాడు. అన్ని విధాలా యోగ్యుడైన అతడికి దూర ప్రాంతాల నుంచి కూడా పెళ్ళి సంబంధాలు రాసాగినై.

ఒక రోజున శ్రీకంఠుడి భార్య భానుమతి భర్తతో, "అబ్బాయికి త్వరగా పెళ్ళి చేయడం భావ్యం. రామాపురం వాళ్ళు లక్షరూపాయిల కట్నం ఇస్తామంటూ కబురు చేశారు," అన్నది.

అందుకు శ్రీకంఠుడు చిన్నగా నవ్వి, "అబ్బాయికి వేరే సంబంధం ఎలా చూస్తాం? సుదర్శనుడి కూతురు సులోచనకు, ఈ సరికి పద్దెనిమిదేళ్ళూ పూర్తయి వుంటాయి కదా!" అన్నాడు.

ఇది వింటూనే భానుమతి ముఖం అప్రసన్నంగా మారిపోయింది. పదిహేను సంవత్సరాలక్రితం, శ్రీకంఠుడు వ్యాపారం ప్రారంభించింది, సుదర్శను డిచ్చిన పెట్టుబడితోనే. ఆ విధంగా సుదర్శనుడు చితికిపోయిన శ్రీకంఠుడి కుటుంబాన్ని ఆదుకున్నాడు. డబ్బు ఇస్తున్నప్పుడే, శ్రీకంఠుడితో దాన్ని అప్పుగా భావించవద్దని నొక్కి మరీ చెప్పాడు.

"నువ్వు డబ్బు తిరిగి తీసుకోని పక్షంలో, యుక్తవయస్కురాలయాక నీ కుమార్తె సులోచనకు ఇష్టమైతే, మా ఇంటి కోడలిని చేసుకుంటాను," అన్నాడు శ్రీకంఠుడు.

అయితే, ఇప్పుడు సుదర్శనుడి ఆర్థిక పరిస్థితి ఏమీ బాగా లేదు. లక్షలకట్నం వదులుకోవడం ఇష్టం లేని భానుమతి, శ్రీకంఠుడితో, "వివాహం వంటి ముఖ్య

మాచిరాజు కామేశ్వరరావు



విషయంలో, ఫలానా అమ్మాయిని చేసు కోమని కొడుకును నిర్బంధించడం ఏం బావుంటుంది!'' అన్నది.

''నేను శ్రీనాధుణ్ణి నిర్బంధించను. సులోచన వాడికి నచ్చకపోతే, మరెవరి కైనా కట్నం ఇచ్చి ఆ అమ్మాయి పెళ్ళి నేనే ఘనంగా జరిపిస్తాను.'' అన్నాడు శ్రీకంఠుడు.

మర్నాడే వాళ్ళు సులోచనను చూసేం దుకు వెళ్ళారు. శ్రీనాధుడికి ఆ అమ్మాయి నచ్చింది. అత్తకు, ఆడపడుచుకు ఈ పెళ్ళి ఏమాత్రం ఇష్టం లేదని తెలియ కుండానే, కోడలుగా ఆ ఇంట్లో అడుగు పెట్టింది, సులోచన.

ఆరు నెలలపాటు తన అదృష్టానికి మురిసిపోతూ కాలం గడిపింది, సులోచన. అయితే, హఠాత్తుగా మామ శ్రీకంఠుడు మరణించడంతో, ఆమె పాట్లు ప్రారంభ మయ్యాయి. తండ్రి మరణంతో శ్రీనాధుడి బాధ్యతలు రెట్టింపయ్యాయి. ఎక్కువగా అతడు ఇంటిపట్టున వుండేవాడు కాదు. దానితో అత్త, ఆడపడుచుల కక్షసాధింపు అరంభమైంది.

''లక్షలు కట్నం తెచ్చే మహాలక్ష్మి లాంటి ఆడపిల్లను కాదని, కోరి ఈ అష్ట దరిద్రాన్ని కోడలుగా తెచ్చాడు, ఆయన!'' అంటూ సులోచనను దెప్పిపొడిచేది భానుమతి.

''వచ్చిన ఆరునెలలకే ఇంటిని వల్ల కాడుగా మార్చిన శని!'' అంటూ మెటి కలు విరిచేది శ్రీవల్లి.

ఇప్పుడు వంటింటి బాధ్యత పూర్తిగా సులోచన నెత్తిన పడింది. తన కసితీరా ఇంటెడుపనీ సులోచనతో చేయిస్తూ, తిట్లూ సాధింపులతో ఆమెను విపరీతంగా బాధిం చేది, భానుమతి. శ్రీవల్లి కూడా వదినెకు ఏమాత్రం సాయం చేయకపోగా, తనకు కావలసినవన్నీ ఆమెచేత తన గదిలోకి తెప్పించుకునేది. అయినప్పటికీ ఈ జరుగుతున్నదేమీ, సులోచన తన భర్తకు చెప్పేదికాదు.

ఒకసారి సులోచనకు విపరీతమైన జ్వరం వచ్చింది. చలికి వణుకుతూ, ఆ నీరసంతోటే ఇంటి పని అంతా చేసిందామె. ఆ సమయంలోనే అత్తా ఆడపడుచు లిద్దరూ పది కోసులదూరంలో వున్న కొండ మీది దేవీ ఆలయానికి ప్రయాణం పెట్టుకున్నారు.

భానుమతి, సులోచనతో, "తెల్లవారి బాడుగబండిలో బయలుదేరితే, సాయంత్రానికి తిరిగి రాగలం. ఆ కొండ మీద తినడాని కేమీ దొరకదు. చీకటితో లేచి మా కోసం చక్కెరపొంగలి చెయ్యి!" అంటూ రాత్రిభోజనాలప్పుడు చెప్పింది.

మర్నాడు తెల్లవారుజామున, చక్కెర పొంగలి చేయాలన్న సంగతి గుర్తుకు వచ్చి, ఉలిక్కిపడి లేచింది సులోచన. అయితే రెండడుగులు వేయగానే కళ్ళు తిరిగి పక్కనే వున్న బల్ల మీద తూలి పడింది. ఆ శబ్దం విని మేలుకున్న శ్రీనాధుడు, ఆమెను మెల్లగా మంచం మీద కూర్చొబెడుతూ, "అప్పుడే లేచావేం?" అని అడిగాడు.

సులోచన సంగతి చెప్పింది.

"నీకు ఒంట్లో బొత్తిగా ఓపికలేదు. ఆ చక్కెర పొంగలేదో నేను చేస్తాను, నువ్వు పడుకో!" అంటూ బలవంతంగా ఆమెను పడుకోబెట్టి వంట గదిలోకి వెళ్ళాడు శ్రీనాధుడు.

తర్వాత కొద్దిసేపట్లోనే శ్రీనాధుడు వంటగదిలోనుంచి ఒక గిన్నెలో వేడివేడి





చక్కెరపొంగలి మూత పెట్టి తెచ్చి, "ఇది తీసుకుపోయి నీ అత్తగారి కివ్వు. నేను చేసినట్టు మాత్రం చెప్పకుసుమా!" అన్నాడు నవ్వుతూ.

సులోచన, భర్త చెప్పినట్టే చేసింది. ఆమె అత్తా, అడబడుచులు బాడుగ బండిలో దేవీ ఆలయానికి వెళ్ళిపోయారు. తర్వాత శ్రీనాధుడు భోజనం చేసి ఊళ్ళోకి బయలుదేరాడు. సులోచన భోజనం చేయకుండానే తలుపు మూసుకుని పడుకున్నది.

చీకటి పడుతున్న సమయంలో, ఎవరో గట్టిగా తలుపు తట్టడంతో మెలుకువ వచ్చి, సులోచన మెల్లగాలేచి వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా అత్తా, అడబడుచులు!

"మమ్మల్ని కడుపుమాడ్చి చంపాలనే, ఆ చక్కెరపొంగలి చేసి ఇచ్చావు, అవునా?" అంటూ రుసరుసలాడుతూ లోపలికి వచ్చింది, శ్రీవల్లి.

"మధ్యాహ్నం ఆకలితో సగం చచ్చి వున్న మేము, చిక్కటి ఆవుపాలు, సన్న బియ్యం, జీడిపప్పు, ద్రాక్షపళ్ళు, యాలక పొడి నోరూరిస్తూంటే, నువ్వు చేసిన ఆ చక్కెరపొంగలినోటపెట్టుకుని ఉమ్మేశాం. అందులో నువ్వు చక్కెర వెయ్యనేలేదు. నువ్వు కావాలనే అలా చేశావు!" అన్నది భానుమతి, సులోచన భుజం పట్టుకుని గుంజుతూ.

ఆ సమయంలో శ్రీనాధుడు ఇంటి వాకిట్లో అడుగుపెడుతూనే, "ఏమిటమ్మా, ఒంట్లో బావులేని కోడలి మీద కత్తులు నూరుతున్నట్టున్నావు?" అన్నాడు నవ్వుతూ.

కొడుకు నవ్వూ, అతడన్న మాటలూ వింటూనే భానుమతి కీచుగొంతుతో, "ఈ ఇంట్లో దీనికేం తక్కువ? ఇంత ఖరీదైన చీరలు, ఇన్ని నగలు ఏనాడైనా ఎరుగునా? ఈ ఇంట్లో దీనికొచ్చిన కష్టం ఏమిటి? నన్నూ, ఆడబిడ్డనూ అదేపనిగా సాధిస్తున్నది!" అన్నది.

''అమ్మా, ఎవరు ఎవర్ని సాధిస్తున్నారో నాకు తెలియంది కాదు. ఆవుపాలు, జీడి పప్పు అంటూ పెద్ద పాఠం చదివావు. అవన్నీ వేసి, చక్కెరపొంగలిలో చక్కెర లేకుండా తయారు చేసింది నేనే. అన్నీ వుండి చక్కెర లేకపోతే, చక్కెరపొంగలి ఎలా తినలేమో, అలాగే అన్నీ వున్నా ప్రేమలేని జీవితం ఎవరికీ రుచించదు,'' అన్నాడు శ్రీనాధుడు.

''అయితే, మాకు సులోచన మీద ప్రేమ లేదంటావా ?'' అన్నది భానుమతి ఆవేశంగా.

''నేను చెప్పదలచిందేమిటో చిటికెలో గ్రహించావు! కోడలు జ్వరంలో వున్నప్పుడు, అత్తా ఆడబడుచులు గుడికంటూ బయలుదేరడమే కాక, చీకటితో లేచి చక్కెరపొంగలి తయారు చేయమనడం ప్రేమ అనిపించుకుంటుందా ? మీకు కాస్త మంచీ చెడుల తారతమ్యం తెలియ చెప్పేందుకే, నేనా చక్కెరపొంగలి తయారుచేశాను. మీరు కలిసి వుండలేకపోతే, చెప్పండి. మేమిద్దరం మరొక ఇల్లు చూసుకుంటాము,'' అన్నాడు శ్రీనాధుడు కోపంగా.

ఇది వింటూనే భానుమతికీ, శ్రీవల్లికీ నెత్తిన పిడుగుపడినట్టయింది. అప్పుడు సులోచన కల్పించుకుని, ''అవేం మాటలండీ! నేను బతికుండగా వేరు కాపరం అంటూ జరగదు. అయినా, ఇంట్లో విషయాలేవో మేం సర్దుకుంటాం; మీ వ్యాపార గొడవలేవో మీరు చూసుకోండి,'' అన్నది తీవ్రస్వరంతో.

సులోచన మాటలతో, ఆమె మంచితనం అర్థమైంది, భానుమతికి. డబ్బు కన్న మనుషుల మధ్య ప్రేమ, ఆప్యాయతలు ముఖ్యం అని గ్రహించిన ఆమె, ''ఇన్నాళ్ళూ మా కళ్ళు మూసుకుపోయాయిరా! నువ్వు చేసిన చక్కెర పొంగలి పుణ్యాన, ఇక ఈ ఇంట్లో గిల్లి కజ్జాలకూ, మనస్తాపాలకూ తావుండదు,'' అన్నది అప్యాయంగా సులోచన భుజం మీద చేయివేసి, కళ్ళు తుడుచుకుంటూ.



# జమీందారుగారి పడవవాడు

చంద్రగిరి జమీందారుకు పడవనడిపేవాడు కావలసివచ్చాడు. ఆయనకు దగ్గిరలో వున్న నదిలో, సాయంవేళల్లో పడవషికారు చేయడం అంటే చాలా ఇష్టం. నది కొండవారగా ఎన్నో మలుపులు తిరుగుతూ, చాలా ఉధృతంగా ప్రవహించేది. అందువల్ల, పడవనడిపేవాడు చాలా నేర్పరి అయి వుండాలని, ఆయన షరతు పెట్టాడు.

ఆయన చెప్పినవిధంగా దివాను చాలా మందిని పరీక్షించి, చివరకు పోలయ్య, జాలయ్య అనే వాళ్ళను జమీందారు దగ్గిరకు తీసుకువచ్చి, "అయ్యా, ఈ పోలయ్య పడవనడపడంలో మంచి నేర్పరేకాక, గజఈతగాడు. పోతే, ఈ జాలయ్య కూడా పడవనడపడంలో చెప్పుకోదగిన నేర్పరే, కాని అంతపెద్ద ఈతగాడు మాత్రం కాదు," అని చెప్పాడు.

జమీందారు ఆ ఇద్దర్నీ రేపు రమ్మని చెప్పి, వాళ్ళు వెళ్ళిపోగానే దివానుతో, "ఆ జాలయ్యను రేపు రాగానే పనిలోకి తీసుకున్నట్టు చెప్పండి," అన్నాడు.

ఇందుకు దివాను ఆశ్చర్యపోతూ, "అయ్యా, అదేమిటి! గజ ఈతగాడు పోలయ్యను కాదని, అంతగా ఈతరాని, ఆ జాలయ్యకు పనిఇద్దామంటున్నారు," అన్నాడు.

జమీందారు మందహాసంచేసి, "పడవనడపడంలో ఇద్దరూ నేర్పరులే. ఇక ఈతలో మాత్రం ఆ పోలయ్య ఘటికుడు. అలాంటివాడు పడవనడపడంలో తగినంత జాగ్రత్తగా వుండడు. కారణమేమంటే, ఒకవేళ ఏదైనా ప్రమాదం జరిగినా, సునాయాసంగా నదిని ఈదుకు పోగలనన్న ధైర్యం వాడికుంటుంది. జాలయ్యకు అంతగా ఈత రాదు గనక, పడవనడపడంలో అతి జాగరూకుడుగా వుంటాడు. అలాంటివాడి చేతిలో, వాడి ప్రాణానికేకాదు, నా ప్రాణానికీ ముప్పు వుండదు, అవునా?" అని అడిగాడు.

"నేనింత దూరం ఆలోచించలేదు. తమరు ఆ ఇద్దర్నీ బాగా అంచనావేశారు!" అన్నాడు దివాను తృప్తిగా.

—వి. ఎస్. రామకృష్ణ






## 2

[వీరగిరి యువరాణి విద్యావతి జన్మదినోత్సవం మూడు రోజులు ఉందనగా, యువరాణి అంతుబట్టని బలహీనతకు లోనయింది. ప్రధాన జ్యోతిషాచార్యుడి సలహాప్రకారం ఆమెను సారస సరోవర విడిదిభవనానికి తరలించారు. రెండు నెలలు గడిచాక యువరాణి విడిది భవనం నుంచి హఠాత్తుగా అదృశ్యమయింది. ఆమె అదృశ్యం కావడానికి ముందు ......]

యువరాణి విద్యావతిని సారససరోవరం వరకు వెళ్ళి దిగబెట్టి వచ్చిన శాలిని, మాలిని అనే పరిచారికలే మరునాడు తెల్లవారగానే యువరాణికి కావలసిన ఆహారపానీయాలను తీసుకుని విడిది భవనానికి బయలుదేరారు. పడవవాడు వాళ్ళను పడవలో విడిదిభవనం మెట్ల వద్ద దించాడు. యువరాణి ఆ రాత్రి ప్రశాంతంగా నిద్ర పోవడం వల్ల, ఆమె ఎంతో ఉత్సాహంగా వుండడం చూసి పరిచారికలు సంతోషించారు. యువరాణికి స్నానాదులు చేయించి, భోజనం పెట్టారు. ఆ తరవాత పరిచారికలు రాజభవనానికి తిరిగివచ్చి, యువరాణిలో వచ్చిన మంచి మార్పును గురించి మహారాణి వజ్రేశ్వరీదేవికి తెలియజేశారు. రాణి ఆ శుభవార్తను ఎంతో ఆనందంతో రాజుకు తెలియజేసింది. విద్యావతి నివాస



ఆ రోజు సాయంకాలం రాజదర్శనం కోసం, ప్రధానజ్యోతిషాచార్యుడువాచస్పతి వచ్చాడని భటులు తెలియజేయగానే, రాజు ఆయనకు ఎదురువెళ్ళి, గౌరవంగా తీసుకువచ్చి, ఉచితాసనంలో కూర్చో బెట్టాడు. విచార వదనులై వున్న రాజ దంపతులను చూసి, జ్యోతిషాచార్యుడు చిన్నగా నవ్వుతూ, "మహారాజా! మీరు రేపే వెళ్ళి, యువరాణిని చూసి రావచ్చు. మధ్యాహ్నం తరవాత ఎప్పుడయినా వెళ్ళ వచ్చు. అయితే, సూర్యాస్తమయం అయ్యే లోగా తిరిగి వచ్చేయాలి!" అన్నాడు.

"విద్యావతిని చూసి మూడు వారా లయింది. ఆమెను వదిలి ఉండలేక పోతున్నాము!" అన్నది రాణి ఎంతో విచారంగా.

రాజు, "రేపు వెళుతున్నాం కదా!" అని రాణిని ఓదార్చి, వాచస్పతాచార్యుడి కేసి తిరిగి, "విద్యావతి గ్రహస్థితిలో ఏదైనా మార్పు వచ్చిందా? ఈ విషయంగా మీరు మీ మిత్రులు జగత్పతాచార్యులను సంప్ర దించారా?" అని అడిగాడు.

"సంప్రదించాను, మహారాజా! ఆయన కూడా నా అభిప్రాయంతో ఏకీభవించాడు. మరొక నలభైరోజులపాటు విద్యావతి స్థితి, ఇలాగే వుంటుందనీ, ఆ తరవాత ఆమె మామూలు మనిషి అవుతుందనీ ఆయన

స్థానంలో, జ్యోతిషాచార్యుడు చేసిన మార్పు కారణంగా, విద్యావతి పరిస్థితిలో అప్పుడే అభివృద్ధిని సూచించే లక్షణాలు కనిపించడంతో రాజదంపతులు పరమా నందం చెందారు.

రెండవ రోజు నందిని, దేవయాని అనే పరిచారికలు యువరాణికి భోజనం తీసు కుని వెళ్ళారు. మూడవ రోజు శాంత, శారద అనే పరిచారికలు భోజన ఫలహారాలు ఇచ్చి వచ్చారు. రోజు రోజుకూ విద్యావతి కోలుకుంటున్నదని పరిచారికలు చెప్పిన మాటలు విని, తామెప్పుడు కుమార్తెను చూడగలమా అని రాజదంపతులు ఎదురు చూడసాగారు. ఇరవై రోజులు గడిచాయి.

అభిప్రాయపడ్డాడు. కాబట్టి మీరేమీ విచారించనవసరం లేదు. రేపు యువరాణిని చూశారంటే మీకే నమ్మకం ఏర్పడుతుంది!'' అని చెప్పి వాచస్పత్యాచార్యుడు అక్కడినుంచి బయలుదేరాడు.

రాజదంపతులు యువరాణిని చూడడానికి ఇరవై ఒకటవ రోజు తగిన సమయం అని జ్యోతిషాచార్యుడు తెలియజేశాడు గనక, ఆ రోజు, యువరాణి మధ్యాహ్నం భోజనం చేసి, విశ్రాంతి తీసుకున్న తరవాత ఆమెను చూడడం ఉచితమని రాజదంపతులు భావించారు.

యువరాణిని చూడడానికి రాజూ, రాణీ వెళుతున్నారని తెలియగానే, ప్రజలు రాజవీధికి ఇరువైపులా దారిపొడవునా బారులుతీరి నిలబడ్డారు. రాజు తమను సమీపించగానే, కొందరు యువరాణి ప్రస్తుత ఆరోగ్యపరిస్థితిని గురించి అడిగారు. యువరాణి త్వరగా కోలుకుంటున్నదని రాజు వారికి మందహాసంతో చెబుతూ ముందుకు నడిచాడు. ప్రజలెంతగానో సంతోషించారు.

సారససరోవరం వద్ద కాచుకుని వున్న పడవవాడు, రాజుకూ, రాణికీ నమస్కరించాడు. రాజదంపతులు మాత్రం పడవలోకి ఎక్కి కూర్చున్నారు. అంగరక్షకులు సైతం ఇవతలి గట్టుమీదే నిలిచిపోయారు. పడవ దీవికేసి కదిలింది.

దీవిలోని విడిది భవనం మెట్లవద్ద నిలబడిన వృద్ధపరిచారిక కమల రాజ





దంపతులకు నమస్కరించి, వారిని యువరాణి వున్న విశాలమైన గదిలోకి తీసుకు వెళ్ళింది. అప్పుడే నిద్రలేచి, కూర్చున్న యువరాణి విద్యావతి, తల్లిదండ్రులను చూడగానే నవ్వుతూ లేచి నిలబడి ఎదురు వచ్చింది. రాణి, ''బావున్నావా, తల్లీ!'' అంటూ ఆమెను ప్రేమతో కౌగలించుకున్నది. తమ కుమార్తె ముఖంలో నవ్వు చూసి రాజదంపతులు పరమానందం చెందారు. కొంత సేపయ్యాక, మహారాణి, విద్యావతి చేయి పట్టుకుని, ఆమెను పక్కనే వున్న ఉద్యాన వనానికి మెల్లగా నడిపించింది. అక్కడ కూర్చుని ముగ్గురూ మరికొంత సేపు మాట్లాడుకుని, సూర్యాస్తమయ సమయానికి రాజదంపతులు, తిరుగుప్రయాణమయ్యారు. పరిచారిక కమల వారివెంట పడవవరకు వచ్చి, నమస్కరించి విడిది భవనానికి తిరిగి వెళ్ళింది.

మరొక మూడు వారాలు గడిచాక, జ్యోతిషాచార్యుడి సలహా ప్రకారం, రాజదంపతులు యువరాణిని చూడడానికి వెళ్ళారు. అప్పుడు, యువరాణి విద్యావతి స్వయంగా పడవ వద్దకు వచ్చి, తల్లిదండ్రులకు నమస్కరించి, ప్రేమతో ఆహ్వానించింది. విద్యావతి ఇప్పుడు దాదాపు సంపూర్ణ ఆరోగ్యంతో కనిపించడం వల్ల, తల్లిదండ్రులు ఆమె దగ్గర ఆరోగ్యం గురించి ప్రస్తావించలేదు. కుమార్తెతో చాలాసేపు సంతోషంగా గడిపి, చీకటి పడుతూన్న సమయంలో వాళ్ళు పడవలో తిరుగు ప్రయాణమయ్యారు.

ఒకవైపు, కుమార్తె మామూలు మనిషి అయిందన్న సంతోషంగా వున్నప్పటికీ, మరొకవైపు కుమార్తెను వదిలి ఇంకా దాదాపు పదినెలలు గడపాలన్న విచారంతో రాజదంపతులు రాజభవనం చేరారు.

ఆ తరవాత మరొక మూడు వారాలు భారంగా గడిచాయి. అయినా, జ్యోతిషాచార్యుడి నుంచి ఎలాంటి వర్తమానమూ రాలేదు. కారణం ఏమై వుంటుందా అని

రాజదంపతులు ఆలోచించ సాగారు. ఒక నాడు రాణి రాజుతో, ''ప్రభూ! జ్యోతిషా చార్యులను తీసుకురమ్మని, భటులను పంపుదామా?'' అని అడిగింది.

''వద్దు దేవీ, ఇది పూర్తిగా జ్యోతిషా చార్యుల నిర్ణయానుసారం జరగవలసిన వ్యవహారం. ఇందులో మన జోక్యం పనికి రాదు. మన కుమార్తె క్షేమం కోసం, మనం తపస్సు లాంటి నియమాలను అనుసరిస్తున్నామన్న సంగతి మరిచి పోయావా? పైగా మన కుమార్తె క్షేమంగా ఉన్నదనే కదా పరిచారికలు చెబుతున్నారు. కాబట్టి మరి రెండు రోజులు ఓపికపడదాం!'' అని రాణిని ఓదార్చాడు రాజు.

అయితే, ఆ రోజు సాయంకాలమే జ్యోతిషాచార్యుడు వాచస్పతి, మిత్రుడు జగత్పతాచార్యుడితో పాటు రాజభవనానికి వచ్చాడు. వారిని చూడగానే రాజు గౌరవంగా లేచి నిలబడి, ఆహ్వానించాడు. ఇరువురూ ఉచితాసనాలలో కూర్చున్నారు. అప్పుడు, వాచస్పతాచార్యుడు, ''రాజా! మీరు రేపు వేకువ జామునే వెళ్ళి మీ కుమార్తెను చూసి రావాలి,'' అన్నాడు.

జ్యోతిషాచార్యుల మాటలలోని తొందరపాటుకు కారణం ఏమైవుంటుందా అని రాజు ఆలోచించసాగాడు. అంతలో జగత్పతాచార్యుడు, ''రేపు సూర్యోదయంలోగా మీరు యువరాణిని తప్పక చూడాలి. ఆ తరవాత మరొక తొంభై రోజులవరకు శుభ





ఘడియలులేవు. అంతేకాదు; యువరాణికి కూడా రానున్న మూడు నెలలలో చాలా క్లిష్టదశ సంప్రాప్త మవుతుంది. ఆ సమయంలో ఆమె ఆరోగ్యానికి ఎటువంటి భంగమూ వాటిల్లదు. కాని....'' అంటూ ఆగిపోయాడు.

అయితే, రేపు వేకువజామున బయలుదేరి వెళ్ళి కుమార్తెను చూడాలన్న ఆలోచనతో రాజు, జగత్పతాచార్యుడు అసంపూర్తిగాచెప్పినమిగతామాటలను పట్టించుకోలేదు. జ్యోతిషాచార్యులిరువురూ వెళ్ళిపోయాక రాణికి ఈ విషయం తెలియజేయడానికి రాజు అంతఃపురంలోకి వెళ్ళి 'ఆమెతో, ''దేవీ, ఇప్పుడే వాచస్పతాచార్యులు జగత్పతాచార్యులతో సహా వచ్చి, మనం రేపు వేకువజామునే వెళ్ళి మన కుమార్తెను చూసిరావాలని సెలవిచ్చారు!'' అన్నాడు.

''అలాగా! సూర్యోదయమయాక వెళ్ళవచ్చు కదా ?'' అని అడిగింది రాణి.

''సాధ్యపడదు. ఇంకొక రెండు, మూడు నెలలు విద్యావతి కేదో క్లిష్టదశ సంప్రాప్త మవుతుందనీ, రేపు తెల్లవారేలోగా ఆమెను మనం చూసి రావాలనీ జ్యోతిషాచార్యులు చెప్పారు!'' అన్నాడు రాజు.

''క్లిష్టదశ అంటే ఏమిటో వివరంగా సెలవిచ్చారా, ప్రభూ!'' అని అడిగింది రాణి విచారంగా.

''లేదు. మొదట మనం రేపు ఉదయం వెళ్ళి, విద్యావతిని చూసివద్దాం. ఆ తరవాత జ్యోతిషాచార్యులను పిలిపించి, ఆ విషయం గురించిన వివరాలు అడుగుదాం,'' అన్నాడు రాజు.

మరునాడు వేకువజామున ఎటువంటి హెచ్చరికా చేయకుండా వచ్చిన రాజదంపతులను చూసి పడవవాడు అమితాశ్చర్యం చెందాడు. రాజదంపతులు పడవలో వెళ్ళి, దీవిలోని విడిదిభవనం చేరేసరికి తూరుపుదిశలో వెలుగురేఖలు కనిపిస్తున్నాయి. రాజదంపతులను ఆహ్వానించడానికి పరిచారిక కమలగాని, యువ

రాణి విద్యావతి గాని రాలేదు. తాము వస్తూన్న సంగతి వాళ్ళకు తెలియదు కాబట్టి, రాలేదనుకుంటూ రాజదంపతులు మెట్లెక్కి భవనంలో అడుగు పెట్టారు.

అంతలో విచారవదనంతో కంగారు పడుతూ, వారికి ఎదురువచ్చిన పరిచారిక కమల, "ఈ సంగతి, అప్పుడే మీకు తెలిసి పోయిందా, ప్రభూ!" అని అడిగింది.

"ఏ సంగతి? ఏం జరిగింది? విద్యావతి ఎక్కడ?" అని అడిగారు రాణీ, రాజూ ఒక్కసారిగా.

"యువరాణిగారు. యువరాణిగారు.... మహారాణీ, యువరాణిగారు కనిపించడం లేదు!" అన్నది పరిచారిక భయం భయంగా.

"కనిపించడం లేదా? విద్యావతి ఎక్కడికి వెళ్ళింది? భవనమంతా వెతికి చూశావా?" అని అడిగాడు రాజు.

మహారాణి నోట మాటరాలేదు.

"ప్రభూ, నా జీవితంలో ఇంతకు ముందెప్పుడూ ఇలా జరగలేదు. రాత్రంతా స్పృహ కోల్పోయినట్టు నిద్రపోయానేమో, లేచేప్పుడు తల భారంగా, మత్తుగా తోచింది. యువరాణిని నిద్రలేపడానికి ఆమె శయనగృహంలోకి వెళ్ళాను. ఆమె కనిపించలేదు. ముందుగానే లేచారేమో అనుకుని మిగతా గదులలో చూశాను. అక్కడా లేదు. ఉద్యానవనంలోనూ వెతికాను, చుట్టుపక్కల తిరిగి వెతికాను, కాని యువరాణిగారి జాడ తెలియడం లేదు," అన్నది పరిచారిక, కన్నీళ్ళతో.

"ఆమె ఎక్కడికి వెళ్ళివుంటుంది?" అంటూ రాణి విద్యావతి శయన గృహం లోకి వెళ్ళి చూసి వచ్చింది.

రాజు మిగతా గదులన్నిటినీ తిరిగి చూశాడు. "విద్యావతీ! విద్యావతీ!" అని పిలుస్తూ రాణి చుట్టుపక్కల కలయ తిరిగింది. ముగ్గురూ పరిసరాలన్నీ వెదికారు. కాని యువరాణి జాడ కనిపించలేదు!

సేనానాయకుణ్ణి పిలుచుకుని రమ్మని రాజు, దూరంగా నిలబడిన పడవవాణ్ణి, ఆజ్ఞాపించాడు. —(ఇంకావుంది)






# పొరబడిన దేవత!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రి వేళ, భయంకరమైన ఈ శ్మశానంలో, నువ్వు కనబరుస్తున్న పట్టుదలా, దీక్షా నాకు ఆశ్చర్యంతో పాటు, ఒక అనుమానం కూడా కలిగిస్తున్నది. అదేమిటంటే—నువ్వు పండితుడివా లేక జ్ఞానివా; ఒకవేళ ఈ రెండూ కాక కేవలం పామరుడివా అన్న సంగతి. పండితుడు తప్పక జ్ఞాని అయివుంటాడనిగానీ, లేక జ్ఞాని తప్పక పండితుడై వుంటాడనిగానీ అనుకోవడం, అంత వాస్తవమైన సంగతికాదని, కొందరు తాత్వికులనడం, నీకు తెలియంది కాదుకదా! ఇందుకు కారణం, ఒకరికి సత్యంగా కనబడే విషయం, మరొకరికి

## బేతాళ కథలు



సత్యదూరం అనిపించడమేగదా? ఇంత ధర్మసూక్ష్మమైన సమస్య ఎదురైనప్పుడు మానవులేకాదు, ఒక్కొక్కసారి దేవత లంతటివారు కూడా పొరబడగలరనేం దుకు నిదర్శనంగా, ఒక పండితుడు-పామరుడి కథ చెబుతాను, శ్రమ తెలియ కుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

పూర్వం సువర్ణదీపికానగరంలో, తార కేశ్వరుడనే గొప్ప సంపన్నుడుండేవాడు. అయితే, అతని సంపద అతడికెన్నో ఇబ్బందులకు కారణమయింది. అతడు చేస్తున్న వర్తక వ్యాపారాలు దినదిన ప్రవర్ధ మానమవుతూంటే, తోటి వ్యాపారస్థులు అతణ్ణి చూసి అసూయపడేవారు. అతడి బంధువులు చీటికీ మాటికీ అతడి ఇంటికి వస్తూ, డబ్బుకోసం వేధించేవారు. అతడి భార్య ఎప్పుడూ నగలూ, అలంకారాలతో కాలం గడిపేదేగాని, భర్త గురించి పట్టించుకునేదికాదు. ఇక కొడుకు ఎప్పుడూ డబ్బు చేతిలో ఆడుతూండే సరికి, వాడి చుట్టూ దుష్ట స్నేహితులు చేరారు. వాణ్ణి ఎంత ప్రయత్నించీ, తార కేశ్వరుడు మంచి మార్గానికి తీసుకురాలేక పోయాడు.

ఈ కారణాలన్నిటివల్లా తారకేశ్వరుడికి మనశ్శాంతి కరువైంది. ఇటువంటి పరిస్థితిలో, అతడికి శివానందుడనే యోగితో పరిచయం కలిగింది.

తారకేశ్వరుడు, యోగిని తనకు మన శ్శాంతి కలిగే మార్గం చెప్పమని కోరాడు. అందుకు యోగి, ''నాయనా! ఇక్కడికి నూరామడలదూరంలో వున్న వింధ్య పర్వత సమీపాన దేవనందన అనే సరస్సున్నది. దాని ఒడ్డున గల ఒక ఆలయంలో దేవనందిని అనే దేవతామూర్తి విగ్రహం వున్నది. ఆ విగ్రహాన్ని దర్శించ గలిగితే, తప్పక నీకు మనశ్శాంతి లభి స్తుంది. అయితే, ఒక సంగతి; జ్ఞానవంతు లకు మాత్రమే, ఆ దేవీ విగ్రహం కనిపి స్తుంది!'' అని చెప్పాడు.



తారకేశ్వరుడు, యోగికి తన కృతజ్ఞత తెలియపరచి, ఒక శుభముహూర్తాన దేవనందిని దర్శనం కోసం బయలుదేరాడు. కొన్ని రోజుల ప్రయాణం తర్వాత మార్గమధ్యంలో, అతణ్ణి తీర్థంకరుడనే బాటసారి కలిశాడు. అతడి మాటతీరును బట్టి, తీర్థంకరుడు పండితుడని గ్రహించాడు, తారకేశ్వరుడు.

తారకేశ్వరుడు, తీర్థంకరుడి ప్రయాణం వింధ్యపర్వతాలకే అని తెలుసుకుని ఎంతో సంతోషించాడు. అటువంటి పండితుడి సాన్నిహిత్యంవల్ల, తను జ్ఞానసముపార్జన చేయవచ్చునని భావించాడు. అతడు తన మనసులో దాగివున్న ఎన్నో భౌతిక, ఆధ్యాత్మిక విషయాలకు సంబంధించిన సందేహాల గురించి, తీర్థంకరుడికి చెప్పుకున్నాడు. వాటన్నిటికీ తీర్థంకరుడు ఉచిత రీతిని జవాబులిచ్చాడు.

అలా కొన్ని రోజుల ప్రయాణంతర్వాత, ఒకనాడు ఒక చెట్టు నీడలో విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు తీర్థంకరుడు, తారకేశ్వరుణ్ణి సూటిగా, "నీ ప్రయాణం వింధ్య పర్వతాలకని అంటున్నావు, బావుంది. కాని, ఆ పర్వత ప్రాంతాల్లోని ఏ ప్రదేశానికి పోదలిచావు?" అని ప్రశ్నించాడు.

ఇందుకు తారకేశ్వరుడు, తన సంపద గురించీ, ఆ కారణంగా కలుగుతున్న ఇబ్బందులూ, మానసిక అశాంతిగురించీ తీర్థంకరుడికి చెప్పి, "నేను అక్కడ వున్న దేవనందినిని దర్శించి, మనశ్శాంతి పొంద దలిచాను," అన్నాడు.

"అలాగా! నేనూ ఆ దేవీదర్శనం కోసమే బయలుదేరాను," అన్నాడు, తీర్థంకరుడు.

ఆ మాటకు తారకేశ్వరుడు ఆశ్చర్యపోతూ, "పండితులైన తమకు ఎదురైన సమస్యలేమైనా వున్నాయా?" అని అడిగాడు.

దానికి తీర్థంకరుడు విచారంగా, "నా తండ్రి మహాపండితుడు. నేను సమస్త శాస్త్రాలూ అధ్యయనం చేశాను. అవి



నాకింత తిండిపెట్టగలిగాయి గాని, నా కోర్కెలను తీర్చలేకపోయాయి. ఉండేందుకు ఒక చక్కని భవనం, నా భార్య మెడలో ఇన్ని నగలు, సంతానానికి అనువైన దుస్తులు—ఇవేవీ నేనుసాధించలేకపోయాను. ఈ కారణంగా నాలో ఎక్కడలేని మానసిక అశాంతి ఏర్పడింది. ఈ సమయంలో వింధ్యపర్వత ప్రాంతంలోని దేవనందినిని దర్శిస్తే, సమస్త సంపదలూ లభిస్తాయని తెలిసింది. ఆ విధంగా నా మానసిక అశాంతిని పోగొట్టుకోవడానికి బయలుదేరాను,'' అన్నాడు.

అంతా విన్న తారకేశ్వరుడు ఎంతో ఉత్సాహంగా, ''మిత్రమా! నేనిక దేవిని దర్శించనవసరం లేదు. వెనక్కు తిరిగి నగరం చేరుకుంటాను,'' అంటూ తిరుగు ముఖం పట్టాడు.

తీర్థంకరుడు, అతణ్ణి ఆపి, ''ఇంత దూరం ప్రయాణం చేసి, దేవిని దర్శించకుండా వెనక్కు తిరిగి పోవడం అవివేకమనిపించుకుంటుంది. సరే, నాకోసమైనా రా. దేవిని దర్శించి ఇద్దరం కలిసి నగరం చేరుకుందాం,'' అంటూ ప్రాధేయపడ్డాడు.

తారకేశ్వరుడు, ఆయన మాట కాదనలేక ముందుకు సాగాడు. కొద్ది రోజుల తర్వాత ఇద్దరూ సరస్సు తీరాన గల దేవి ఆలయాన్ని చేరారు. ఆలయం శిథిలావస్థలో వున్నది. ఆలయం ముందున్న రాతిస్తంభం మీద, ఒక శిలాశాసనం వున్నది. అందులో జ్ఞానవంతులకు మాత్రమే దేవీవిగ్రహం గోచరమవుతుంది, అని వున్నది.

ఆ శాసనం చదివిన తీర్థంకరుడు, సమీపాన గల సరస్సులో స్నానం చేసి, ఆలయంలో ప్రవేశించాడు. ఆయనకు ఆలయంలో ఏ దేవీమూర్తి విగ్రహమూ కనిపించలేదు. దేవనందిని విగ్రహం మట్టిలో కలిసిపోవడమో, లేక ఎవరైనా ఎత్తుకుపోవడమో జరిగి వుంటుందని, తీర్థంకరుడు ఊహించాడు.

అంతలో తారకేశ్వరుడు, అడవిపూలతో అల్లిన ఒక మాలతో ఆలయంలో ప్రవేశించాడు. అది చూసిన తీర్థంకరుడు, ''కష్టపడి మాల కట్టి తెచ్చావు. కాని, ఇక్కడ దేవీవిగ్రహం లేదు!'' అన్నాడు.

అందుకు తారకేశ్వరుడు, ''నీ వంటి జ్ఞానశూన్యులకు దేవీవిగ్రహం ఎలా గోచరిస్తుంది!'' అని భక్తితో కళ్ళు మూసుకుని విగ్రహానికి చేతులెత్తి నమస్కరించాడు.

తీర్థంకరుడిది చూసి వెటకారంగా, ''తారకేశ్వరా! జ్ఞానవంతుడనిపించుకోవడానికి, కనిపించని దేవీవిగ్రహం కనిపిస్తున్నట్లు కపటనాటకం ఆడుతున్నావా?'' అని అడిగాడు.

తారకేశ్వరుడు, తీర్థంకరుడికి జవాబు ఇవ్వకుండా, చేతిలోని పూలమాలను విగ్రహానికి అలంకరించాడు. తీర్థంకరుడికి విగ్రహమైతే కనిపించలేదు గాని, పూలమాల గాలిలో నిలబడినట్లు కనిపించింది. అక్కడ విగ్రహం లేకపోతే, పూలమాల వట్టి గాలిలో నిలబడలేదు. కనుక అక్కడ విగ్రహమున్నది! అయితే, అది తారకేశ్వరుడికి కనిపించింది గాని, తనకు కనిపించలేదని గ్రహించాడు, తీర్థంకరుడు.

కొద్దిసేపటి తర్వాత, ఇద్దరూ కలిసి బయలుదేరి కొన్నాళ్ళకు నగరం చేరారు.



తారకేశ్వరుడు, తీర్థంకరుణ్ణి తన భవనానికి తీసుకుపోయి, ''నీ పాండిత్యానికి మెచ్చి, నేనిస్తున్న కానుక! కాదనక స్వీకరించ కోరుతున్నాను.'' అని తీర్థంకరుడికి విలువైన వజ్ర వైడూర్యాలూ, బంగారుకాసులూ ఇచ్చాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, మనశ్శాంతి పొందడానికి, దేవీదర్శనం కోసం బయలుదేరిన తారకేశ్వరుడు, చివరిక్షణంలో మనస్సు మార్చుకుని, నగరానికి తిరిగిపోతాననడంలో అర్థమేమిటి? ప్రయాణ సమయంలో అతడి సందేహాలకెన్నిటికో, తన పాండిత్యంతో తృప్తికరమైన జవాబులిచ్చిన తీర్థంకరుణ్ణి, జ్ఞాన

శూన్యుడనడం, తారకేశ్వరుడి పామరత్వానికీ, అహంకారానికీ చిహ్నం కాదా? అన్నిటికన్నా ఆశ్చర్యకరమైనదే గాక, నాకు దిగ్భ్రమ కలిగించే సంఘటన; దేవనందిని దేవత, పండితుడూ, జ్ఞానీ అయిన తీర్థంకరుడికి కనిపించకుండా, పామరుడైన తారకేశ్వరుడికి కనిపించడం! ఇది దేవతలంతటివారు కూడా, ఒక్కొక్కసారి పొరబడతారనడానికి తార్కాణం కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది.'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''తారకేశ్వరుడు తనకు మనశ్శాంతి లేకపోవడానికి కారణం, తన సంపదలని అపోహపడ్డాడు. అయితే, అంత గొప్ప పండితుడైన తీర్థంకరుడు, అదే సంపదలకోసం దేవీదర్శనానికి బయలుదేరినట్లు వినగానే, అతడి అపోహ పటాపంచలైంది. తనకున్న దానిని సాధ్యమైనంతలో నలుగురితో పంచుకోవడం ద్వారా, తను మనశ్శాంతి పొందవచ్చని అతడు గ్రహించాడు. ఈ కారణంవల్లనే—అంత పండితుడై వుండీ, సంపదల లంపటంలో మునగజూస్తున్న తీర్థంకరుణ్ణి జ్ఞానశూన్యుడివన్నాడు. అతి సామాన్యుడైన మనిషి గుర్తించిన, ఈ ధర్మసూక్ష్మాన్ని దేవత గుర్తించ లేదనుకోవడం అపచారమవుతుంది. అందువల్ల, దేవనందిని తారకేశ్వరుడికి కనిపించి, తీర్థంకరుడికి కనిపించకపోవడంలో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు! ఇంకొక సంగతి: తారకేశ్వరుడు పండితుడు కాకపోవచ్చుగాని, జ్ఞాని అనడంలో, అత్యంత ఉదారబుద్ధి అనడంలో సందేహం ఏమీ లేదు. ఆ కారణం గానే అతడు, తీర్థంకరుడి పాండిత్యాన్ని మనసులోనే మెచ్చుకుని, విలువైన కానుక లిచ్చాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ఎస్. శివనాగేశ్వరరావు రచన]





# అబద్ధాలపోటీ

విశాలపురం మహారాజు గరుడసేనుడికి, చక్కగా అబద్ధం చెప్పి తనను నమ్మించ గలిగినవాడిని సన్మానించాలని ఒక విచిత్ర మైన కోరిక కలిగింది. ఆయన ఆస్థాన విదూషకుణ్ణి పిలిచి సంగతి చెప్పాడు.

విదూషకుడు ఒకక్షణం ఆలోచించి, "దీనికి ఒకే ఒక తిరుగులేని రాజమార్గం వుంది, మహారాజా! మనం వచ్చే మాసంలో, ఈ అబద్ధాలపోటీని ఏర్పాటు చేసి, దేశం నలుమూలల నుంచీ అబద్ధాలు చెప్పడంలో రాటు తేలిన వాళ్ళందర్నీ పాల్గొనవలసిందిగా ఆహ్వానిద్దాం. ఏమం టారు, మహారాజా?" అని అడిగాడు.

"నీ ఆలోచన అద్భుతంగా వుంది. వెంటనే అవసరమైన ఏర్పాట్లు చెయ్యి," అన్నాడు గరుడసేనుడు.

విదూషకుడు ఏదో సంకోచిస్తున్న వాడిలా ముఖం పెట్టి, "మన రాజప్రాసాద ప్రాంగణంలోని సభాభవనం ఇందుకు సరిపోదు. అందువల్ల, ఉద్యానానికి తూర్పున వున్న క్రీడాభవనంలో పోటీకి వచ్చేవాళ్ళకు వసతులు ఏర్పాటు చేసి, అక్కడే పోటీలు నిర్వహిద్దాం. ఇందుకు అవసరమయ్యే ఖర్చులకుగాను, రెండు వేలవరహాలు ఇప్పించండి," అన్నాడు.

రాజు ఇందుకు సరేనని, కోశాధికారి చేత విదూషకుడికి రెండువేలవరహాలు ఇప్పించాడు.

"మహారాజా! రేపే ఈ పోటీ గురించి దేశమంతటా చాటింపు వేయిస్తాను. ఈ క్షణం నుంచే పోటీలో పాల్గొనేందుకు వచ్చేవాళ్ళకోసం అన్ని ఏర్పాట్లూ ప్రారంభ మవుతాయి," అన్నాడు విదూషకుడు.

చివరకు అబద్ధాలపోటీ సభ ప్రారంభ మయ్యే దినం రానే వచ్చింది. రాజు గరుడసేనుణ్ణి ఉదయం ఎనిమిది గంట

రాంబాబు

లకే పోటీలు ప్రారంభించవలసిందిగా విదూషకుడు చెప్పడం వల్ల, ఆయన ఆ సమయానికి ఆ ప్రదేశానికి చేరుకున్నాడు.

అయితే, గరుడసేనుడికి అక్కడ పోటీ కార్యక్రమాలకు సంబంధించిన హడావుడి ఏమాత్రం కనిపించలేదు. అంతేకాక తను కూర్చోవడానికి ఆసనం కూడా లేదు!

గరుడసేనుడూ అక్కడ వున్న కాపలా భటుణ్ణి పిలిచి, "ఈ రోజు ఇక్కడ అబద్ధాలపోటీ జరగవలసి వుంది కదా! ఇంతవరకూ, ఆ కార్యక్రమం అమలు జరపడానికి, ఎలాంటి ప్రయత్నం జరుగుతున్నట్టు కనబడదేం?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే భటుడు, "క్షమించండి, మహారాజా! మీరనేదేమిటో, నాకర్థం కావడం లేదు. ఆ పోటీల సంగతి, నాకు తెలియదు," అన్నాడు భయంగా.

అంతలో విదూషకుడు అక్కడికి వచ్చాడు. గరుడసేనుడు అతడి కేసి కోపంగా చూస్తూ, "నువ్వు ఇంతకూ, ఈ అబద్ధాలపోటీ గురించి చాటింపు వేయించావా, లేదా? ఎవరూ రాలేదేం? అసలు ఆ పోటీ గురించిన ఏర్పాట్లే నువ్వు ప్రారంభించినట్టులేదు! నీ సంజాయిషీ ఏమిటి?" అని అడిగాడు.

దీనికి విదూషకుడు చేతులు కట్టుకుని, "క్షమించాలి, మహారాజా! మీరనేదేమిటో నాకు తెలియడం లేదు. మీరేదో ఏర్పాట్లంటున్నారు. వాటి గురించి తమరు నాకేం చెప్పలేదు. మీ ఆజ్ఞను ధిక్కరించేటంత సాహసం చేయగలనా? అసలు విషయమేమిటో సెలవివ్వండి!" అన్నాడు.

విదూషకుడు ఇలా అనగానే గరుడసేనుడికి విషయం అర్థమైంది. ఆయన పెద్దగా నవ్వి, "అయితే, అబద్ధాలపోటీ పూర్తయిందన్న మాట! మొత్తానికి ఇలాంటి పోటీలో నిన్ను మించినవాడు లేడని నిరూపించుకున్నావు. నేను నీకిచ్చిన రెండువేలవరహాలూ తిరిగి ఇవ్వనవసరం లేదు. అదనంగా మరొక రెండు వేలవరహాలు ఇస్తున్నాను!" అంటూ విదూషకుణ్ణి ఎంతగానో మెచ్చుకున్నాడు.



# చందమామ

## అనుబంధం—43




మనదేశపు పక్షులు-జంతువులు :

## కోకిల

పక్షులన్నిటిలోకీ మృదుమధురమైన కంఠస్వరం కలిగినది కోకిల. కోకిలగానాన్ని ప్రశంసించని ప్రాచీన భారతీయ సాహిత్యం లేదు. విద్వత్తుగల కవులనూ, గాయనీమణులనూ—'కవికోకిల,' 'గానకోకిల' మొదలైన బిరుదులతో సత్కరించడం మనదేశ సంప్రదాయం! వసంతకాలం రాగానే గుబురుచెట్ల నుంచి కోయిలగానం శ్రావ్యంగా వినిపిస్తుంది. అయితే, చలికాలం వస్తే కోయిల గొంతు విప్పదు. వెచ్చటి వాతావరణం వెతుక్కుంటూ వెళ్ళిపోతుంది.

మగకోకిల మరీ నల్లగా వుంటుంది: దాని ముక్కు పసుపు-ఆకుపచ్చ రంగుతోనూ, కంటి చుట్టూ ఎరుపుగీతా వుంటుంది. ఆడకోయిల మరీ అంత నల్లగా ఉండదు. ఒంటి మీద తెల్లటి చారలూ, చిన్న మచ్చలూ ఉంటాయి. కోకిలకు గూడు కట్టడం అంటే అయిష్టం. అందువల్ల ఆడకోయిల, కాకి గూళ్ళలో గుడ్లు పెడుతుంది. కోయిల గుడ్లు కూడా కాకి గుడ్ల లాగే లేత బూడిద రంగులో ఉంటాయి. కాకులు ఆ గుడ్లను తమవే అనుకుని పొదిగి, పిల్లలకు ఆహారం అందించి పెంచుతాయి!

కోకిలలు ఆకులు గుబురుగా వున్న పెద్ద పెద్ద చెట్లలో నివసిస్తాయి. పళ్ళూ, పురుగులూ వీటి ప్రధాన ఆహారం.

వార్తలలో బాలలు:

# వర్ధమాన కవి!

పుస్తకప్రియులు, పుస్తకాలలో వాటి రచయితల సంతకాల (ఆటోగ్రాఫ్) కోసం ఎగబడడం అన్నది పాశ్చాత్య దేశాలలో సర్వసాధారణమైన విషయం. అక్కడి రచయితలకు వున్న పేరు ప్రఖ్యాతులు అలాంటివి. అయితే, మన దేశంలో అటువంటి సంఘటనలు చాలా అరుదుగా జరుగుతూ వుంటాయి. పదకొండేళ్ళ 'వర్ధమాన కవి' ఆదిత్య దామోదరన్ విషయంలో అలాంటిదే జరిగింది!

కొత్తఢిల్లీలో గత ఫిబ్రవరి నెలలో ప్రపంచ పుస్తక ప్రదర్శన జరిగింది. అక్కడ ఒక సుప్రసిద్ధ ప్రచురణా సంస్థ ఏర్పాటుచేసిన కొట్టులో కూర్చుని, ఆదిత్య నవ్వుతూ తన కవితా 'సంకలనం'లో సంతకాలు చేస్తూ అందరినీ ఆశ్చర్యపరిచాడు. అంతకు ముందే ఆదిత్య రచించిన 'వైబ్రేషన్స్' (తరంగాలు) అనే ఆంగ్లకవితా సంకలనాన్ని మెచ్చుకుంటూ సమీక్షలు వెలువడ్డాయి. వాటిని చదివిన పుస్తకప్రియులు—అక్కడికి వచ్చిన 'బాలకవి!' సంతకం కోసం వరుసలో నిలబడ్డారు. అలా నిలబడిన పుస్తకాభిమానులలో కవితాసక్తి కలిగిన బాలబాలికలు ఎక్కువ మంది కనిపించారు.



ఆదిత్య మొట్టమొదట ఎనిమిదేళ్ళ ప్రాయంలోనే ఒక పద్యం రాశాడు. ఆదిత్య అప్పుడప్పుడు కవితలను చదువుతూ వుండేవాడు. ఆదిత్య తండ్రి, మన దేశం ఈశాన్య ప్రాంతాలయిన బెంగాల్, అస్సాం రాష్ట్రాలలో ఉన్నతోద్యోగం చేస్తూండేవాడు. అక్కడ త్వరగా పొద్దుగూకడం వల్ల, ఆదిత్య తన తండ్రి గదిలోకి వెళ్ళి, పుస్తకాలు తీసి చదువుకోవడం ఆరంభించాడు. మొదట అతని దృష్టిని కవితలే ఆకర్షించాయి. కవితలలోని భావం అర్థం కాకపోయినప్పటికీ వాటిలోని లయ అతన్ని ఆకట్టుకునేది. ఆ తరవాత మాటల అర్థాలను తల్లిదండ్రులను అడిగి తెలుసుకోసాగాడు.

ప్రకృతి సౌందర్యం నిండిన, ప్రశాంత వాతావరణం గల తూర్పు రాష్ట్రాలను వదిలి వచ్చి ఆదిత్య కలకత్తా, ఢిల్లీ వంటి మహా నగరాలను చూశాడు. అక్కడి వాతావరణ కాలుష్యం, పేదరికం, అతన్ని కలవరపెట్టాయి. అతడు తన మనసులోని భావాలను మాటలలో పెట్టడం నేర్చుకున్నాడు. అవే కవితలయ్యాయి! ఆదిత్య మిగతా అందరి పిల్లలలాగే, బడినుంచి ఇంటికి రాగానే 'హోంవర్క్' పూర్తి చేస్తాడు. ఆ తరవాత ఆటలాడుకోవడానికి వెళతాడు. ఫుట్‌బాల్ అంటే ఇష్టం. చదరంగం అతని అభిమాన క్రీడ. సాయంకాలం బడి పాఠాలు చదువుకుంటూ గడిపి, రాత్రి భోజనం చేశాక, తన గదిలోకి వెళ్ళి 'పర్సనల్ కంప్యూటర్' ముందు కూర్చుని కవితలల్లడం ఆరంభిస్తాడు.

'కంప్యూటర్ ఇంజనీరు' కావాలన్నది ఆదిత్య ఆశయం. అందుకు ఇంకా 10-15 సంవత్సరాలు పట్టవచ్చు. కాబట్టి ఈలోగా ఈ 'వర్ధమాన బాలకవి' నుంచి మరి కొన్ని కవితాసంకలనాలను ఆశించవచ్చు!

# మీకు తెలుసా?

1. బంగారం, వజ్రాలు, రత్నాలు మొదలైన వాటి ఆధార తూనిక ప్రమాణం ఏది?
2. అధిక ప్రకాశవంతమైన నక్షత్రం ఏది?
3. ప్రపంచంలో మొట్టమొదటి 'పేపర్ బ్యాక్' పుస్తకాన్ని ప్రచురించినవారెవరు?
4. ఈ సంవత్సరం 'ఆస్కార్' ప్రత్యేక అవార్డు మన సత్యజిత్‌రాయ్‌కి లభించింది. ఆ అవార్డుకు 'ఆస్కార్' అనే పేరు ఎలా వచ్చిందో తెలుసా?
5. 25 ఏళ్ళకు జరుపుకునే రజతోత్సవాన్ని ఆంగ్లంలో 'సిల్వర్ జూబ్లీ' అంటారు. మరి 'పేపర్ ఆనివర్సరీ' అని దేనిని అంటారో తెలుసా?
6. శక కాలమాన సంవత్సరంలో మొదటి నెల ఏది?
7. 1921 వ సంవత్సరానికి పూర్వం 'టేబుల్ టెన్నిస్'కు మరొక పేరు వుండేది. అదేమిటి?
8. పుట్టినరోజే నవ్వాడని ఒక పారశీక ప్రవక్తను గురించి చెబుతారు. ఆయన ఎవరు?
9. రక్తాన్ని నాలుగు గ్రూపులుగా విభజించారు. ఏ, బి, ఓ అన్నవి మొదటి మూడు. నాలగవ గ్రూపు పేరేమిటి?
10. ఒకేసమయంలో మూడు దేశాల అధ్యక్షపదవిని అలంకరించినవారెవరు? ఎప్పుడు?
11. 'జీబ్రా'ల ప్రత్యేక లక్షణం ఏమిటి?
12. ఎన్ని చంద్రులకు శనిగ్రహం ఉన్నది?
13. అంతరిక్షం నుంచి చూస్తే ఆకాశం ఏ వర్ణంలో కనిపిస్తుంది?
14. ఆగ్రాను స్థాపించినవారెవరు? ఎప్పుడు?
15. వానపాముకు కళ్ళూ, చెవులూ ఉన్నాయా?

## సమాధానాలు

1. క్యారెట్.
2. జ్యేష్ఠానక్షత్రం.
3. యాన్టన్ ఫిలిప్ రిక్లేమ్. 1867 వ సం॥లో.
4. అమెరికాలో 1929 వ సం॥లో ఈ అవార్డులను మొట్టమొదట ఇచ్చినప్పుడు జ్ఞాపికగా ఒక మనిషి బొమ్మను రూపొందించారు. చలనచిత్రాల అకాడెమీ అధికారి, ఆ బొమ్మను చూసిఅచ్చంగ అది తన మామ 'ఆస్కార్'లా ఉన్నదని అన్నారు. అప్పటి నుంచి దానికి ఆ పేరే తీసుకున్నారు.
5. మొట్టమొదటి వార్షికోత్సవాన్ని.
6. చైత్రం.
7. పింగ్-పాంగ్.
8. జొరాష్టర్.
9. ఏబి.
10. సైమన్ బొలివియర్. 1928. ఆయన బొలీవియా, పెరూ, కొలంబియాలకు అధ్యక్షుడుగా వున్నారు.
11. ఏ రెండు జీబ్రాలకు గాని ఒకే రకమైన చారలు వుండవు.
12. పది.
13. నలుపు.
14. సికందర్‌లోడి, 1506 వ సం॥లో.
15. లేవు.

# చందమామ కబుర్లు

## ఎత్తయిన వంతెన!

ప్రపంచంలోకెల్లా వాహనాలు వెళ్ళగల ఎత్తయిన వంతెన ఎక్కడ వున్నదని ఎవరైనా అడిగితే— జమ్ము-కాశ్మీర్ లడక్ ప్రాంతంలోని ఖర్దంగ్‌లా (సముద్ర మట్టానికి 18,503 అడుగుల ఎత్తులో) సమీపంలో వున్నదని సగర్వంగా చెప్పవచ్చు. 'భారత సరిహద్దు రోడ్డు రవాణా సంస్థ' ఈ పథకాన్ని చేపట్టింది. ఈ వంతెన నిర్మాణాన్ని పర్యవేక్షించిన చీఫ్ ఇంజనీరు బ్రిగ్ వాంబట్ కేరా 'గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్'లో స్థానం సంపాయించాడు.





## ఒక చెట్టుకు ఐదు లక్షలు!

మెక్సికోలోని ఓక్సాకా రాష్ట్రంలో ఆహోహ్యూటే అనే ఒక బ్రహ్మాండమైన తమాల జాతి వృక్షం యేటా లక్షలాది పర్యాటకులను ఆకర్షిస్తున్నది. దాని వయసు 2000 సం॥ మించి వుంటుందని చెబుతున్నారు. ప్రత్యేక ఆకర్షణగా వుంటూన్న ఆ వృక్షాన్ని రక్షించడానికి 5,000,00 డాలర్లు ఖర్చుచేయడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

## లేతపసుపు కంటికి వెలుగు!

చూపు సరిగా లేని పిల్లలు లేత పసుపురంగు కళ్ళద్దాలు పెట్టుకుంటే చూపు మెరుగవుతుందన్న విషయం ఇటీవల వెలుగులోకి వచ్చింది. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం 'నాడీ మండల వైద్య' విభాగానికి చెందిన డా॥ జాన్ స్టీన్ — మామూలు కళ్ళద్దాలు పెట్టుకున్న 20 మంది విద్యార్థులపై కొన్ని ప్రయోగాలు జరిపారు. లేతపసుపు రంగు కళ్ళద్దాలు పెట్టుకోవడంవల్ల వాళ్ళ కంటి చూపు కాస్త మెరుగయినట్టు తెలియవచ్చింది.





# జ్యోతిష్పండితుడు

రామశాస్త్రి తండ్రివద్ద సకల శాస్త్రాలూ నేర్చుకున్నాడు. వాడికి కవిత్వం చెప్పడం కూడా వచ్చు. అయితే వాడికి జ్యోతిష మంటే ఎంతో ప్రాణం. చిన్నతనంలోనే తనకు వచ్చిన మిడిమిడి జ్ఞానంతో తన వద్దకు వచ్చిన కొందరికి జోస్యం చెబితే, అది అక్షరాలా నిజమయింది. అప్పటి నుంచీ వాడు జోస్యమే వృత్తిగా చేసుకుని జీవించాలనుకున్నాడు.

తండ్రి వాడిని హెచ్చరిస్తూ, ''నాయనా! జ్యోతిషశాస్త్రం పూర్తిగా నమ్మకంమీద ఆధారపడింది. జరగబోయేది కచ్చితంగా చెప్పడం, ఆ బ్రహ్మతరం కూడా కాదు. కాబట్టి సకలశాస్త్ర పారంగతుడివైన నువ్వు, కేవలం జ్యోతిషాన్నే వృత్తిగా తీసుకోకు. అది నీకు మంచిది కాదు. కవిత్వంతో, పాండిత్యంతో రాణించి పేరు ప్రతిష్ఠలు సంపాదించుకో. అడిగినవారికి సరదాగా జ్యోతిషం చెప్పు. అభిమానంతో ఎవరైనా కానుకలిస్తే పుచ్చుకో తప్పు. జోస్యం పేరుచెప్పి ఎవర్నీ డబ్బడక్కు!'' అన్నాడు.

రామశాస్త్రికి తండ్రి మాటలు రుచించ లేదు. బ్రహ్మతరం కూడా కాని విశేషం తను సాధిస్తానన్నాడు. వాడి అదృష్టమో ఏమో వాడి జోస్యం ఒక్కసారి కూడా అంతవరకూ తప్పలేదు.

ఆ ఊళ్ళో నలుగురి జాతకాలు చూసి, పెరట్లో లంకెలబిందెలున్నాయని రామ శాస్త్రి చెప్పాడు. వాడు చెప్పినచోటవాళ్ళకు లంకెలబిందెలు దొరకడంతో, రామశాస్త్రి పేరు చుట్టుపక్కల ఊళ్ళలో కూడా మ్రోగిపోయింది.

ఒకరోజున సుబ్బారాయుడు, వీరభద్రం అనే ఇద్దరు పొరుగూళ్ళవాళ్ళు, రామ శాస్త్రి వద్దకు జోస్యం చెప్పించుకునేందుకు

వచ్చారు. సుబ్బారాయుడిది రామాపురం, పెద్ద భూస్వామి. వీరభద్రానిది కృష్ణాపురం. కోపం వస్తే హత్యలు చేయడానికూడా వెనుకాడడని అతనికి చుట్టుపక్కల పేరు.

తండ్రి, రామశాస్త్రిని పిలిచి, "వీళ్ళిద్దరూ నాకు బాగా తెలుసు. నరహంతకులు. ఇలాంటి వాళ్ళకు జోస్యం చెప్పడం నీకు ప్రాణాపాయం. నా మాట విని, మంచి మాటలతో వీళ్ళను వెనక్కుపంపెయ్యి." అని రహస్యంగా చెప్పాడు.

రామశాస్త్రికి ఈ మాటలు నచ్చలేదు. వాడికి తన జ్యోతిష శాస్త్ర పాండిత్యం మీద అపారమైన నమ్మకం. వాడు ఇద్దరి జాతకాలూ పరిశీలించి, "మీ ఇంటి పెరళ్ళలో నాగుపాము పుట్టలున్నాయి. వాటిని తవ్విస్తే, మీకు శుభం జరుగుతుంది," అని చెప్పాడు.

ఇది జరిగిన వారంరోజులకు రామశాస్త్రి తండ్రి పట్నంవెళ్ళి వచ్చాడు. అక్కడ ఆయనకు సుబ్బారాయుడు, వీరభద్రం తటస్థపడ్డారట. ఒకరి పెరట్లో పుట్టతవ్వితే, పదిలక్షల వరహాలున్న నిధి దొరికింది. ఆయన రామశాస్త్రికి పదివేల వరహాలిచ్చి ఘనంగా సన్మానం చేయాలనుకుంటున్నాడు. ఇంకొకరి పెరట్లో పుట్ట తవ్వగానే బుస్సుమంటూ నాలుగు పాములు బైటకు వచ్చి, ఇంట్లో వాళ్ళను కాటేసిపోయాయి. ఇప్పుడింటికి ఆయనొక్కడే మిగిలాడు. అతడు పట్టరాని ఆగ్రహంతో రామశాస్త్రి



తల తీసి, తన ఇంటి ముందు వ్రేలాడదీయాలనుకుంటున్నాడు.

"నేననుకున్న ప్రమాదం రానే వచ్చింది. మనమిక్కడుండడం ఏమాత్రమూ క్షేమం కాదు. కొంతకాలం పాటు వేరే ఊళ్ళో వుండిపద్దాం," అన్నాడు రామశాస్త్రి తండ్రి.

దీనికి రామశాస్త్రి కూడా కాదనలేదు. అయితే, ముందుగా తన జోస్యం ఫలించిన చోటుకు వెళ్ళి, పదివేల వరహాలూ తీసుకుని సన్మానం పొంది రావాలని వాడికి కోరికగా వుంది.

"సరే, అలాగే చేసిరా!" అన్నాడు తండ్రి.

"నా జోస్యం ఎవరికి ఫలించిందో చెప్పు!" అన్నాడు రామశాస్త్రి.

రామశాస్త్రి తండ్రి కాసేపాలోంచి, "సుబ్బారాయుడూ, వీరభద్రం కూడా నన్ను కలుసుకుని మాట్లాడారు. అయితే శుభమెవరికి జరిగిందో, అశుభమెవరికి జరిగిందో నాకిప్పుడు గుర్తురావడంలేదు," అన్నాడు.

"బాగా ఆలోచించి చెప్పు, నాన్నా! ఇది నాకు జీవన్మరణ సమస్య," అన్నాడు రామశాస్త్రి.

తండ్రి మరికాసేపాలోచించి, "వయసు మీరిపోయింది. అన్నీ త్వరగా మరిచిపోతున్నాను. ఎంత ప్రయత్నించినా నీకు సన్మానం చేస్తానన్నదెవరో, చంపుతానన్నదెవరో స్ఫురణకు రావడంలేదు. పోనీ ఒక పని చెయ్యి. నీ జ్యోతిష పాండిత్యం



ఉపయోగించి రామాపురం వెళ్ళాలో, కృష్ణాపురం వెళ్ళాలో నిర్ణయించుకో. నీ జోస్యం తప్పదు కాబట్టి, సరైన ఊరికే వెళతావు. లెక్కలు జాగ్రత్తగా వెయ్యి. లేకుంటే వెళ్ళినవాడివి తిరిగిరావు,'' అన్నాడు.

రామశాస్త్రి చాలా సేపు లెక్కలువేశాడు. అయినా, ఒక నిర్ణయానికి రాలేక తండ్రితో, ''నేను విషమ సమస్యలో ఇరుక్కున్నాను. అసలు ఈ ఊరొదలడమే, నాకిష్టం లేదు. అందుకోసం అవసరమైతే జ్యోతిష శాస్త్రాన్నే విడిచిపెడతాను. నాకిప్పుడు సన్మానంమీద ఆశలేదు. ఈ ఊళ్ళో వుండే మార్గం కావాలి!'' అన్నాడు.

తండ్రి నవ్వి, ''జ్యోతిష శాస్త్రాన్ని విడిచిపెట్టడం మంచిదే! ఎందుకంటే—ఎదుటివారి విషయంలో నువ్వెన్ని తప్పులు చెప్పినా, అవి నీకు గుర్తుండవు. సరిగా చెప్పినవే గుర్తుంచుకుని, నీ అంతటివాడు లేడనుకుంటావు. సుబ్బారాయుడు, వీరభద్రం విషయంలో, ఒకరి గురించి నీ జోస్యం తప్పిందంటే, నువ్వాశ్చర్య పోలేదు. మొదటిసారిగా జోస్యం తప్పిందే అనుకోలేదు. అంటే, నీకిది కొత్తకాదు. నీ ప్రాణం ప్రమాదంలో పడితేమాత్రం, నువ్వు నీ జ్యోస్యాన్ని ఏమాత్రం నమ్మలేదు. ఇంతకీ నేను సుబ్బారాయుడు, వీరభద్రాలను కలవలేదని కూడా, నీ జోస్యం నీకు చెప్పలేదు. ఎన్నో శాస్త్రాల్లో పాండిత్యమున్న నువ్వు, పండితులు మెచ్చుకునే విధంగా చక్కగా కవిత్వం చెప్పగలిగిన నువ్వు, ఒక్క శాస్త్రాన్నే నమ్ముకోవడం మంచిది కాదని ఇప్పటికైనా అర్థమయిందా?'' అన్నాడు.

రామశాస్త్రి, తండ్రి పాదాలకు నమస్కరించి తన తప్పొప్పుకుని, ఆ రోజునుంచీ తండ్రి చెప్పినట్లే వింటూ కవిగా, పండితుడిగా గొప్ప పేరు తెచ్చుకున్నాడు. వాడికి జ్యోతిష శాస్త్రంలో కూడా చెప్పుకో తగ్గ ప్రావీణ్యమున్నదని అంతా చెప్పుకుని గౌరవించేవారు. ఆ విధంగా వాడు కలకాలం కీర్తి ప్రతిష్ఠలతో జీవించాడు.






# జ్ఞానాన్వేషణ

పూర్వం ఉజ్జయినీ నగరంలో, శాంత భూషణుడనే గొప్ప పండితుడుండేవాడు. ఆయన చదవని శాస్త్రం లేదనీ, ఆయనకు తెలియని విషయమంటూ ఏదీ వుండబోదనీ అంతా అనుకునేవారు.

శాంతభూషణుడి ప్రియ శిష్యులైన శాండిల్యుడికీ, చమనుడికీ తమ గురువుగారు అంతటి అపారమైన పాండిత్యాన్ని, ఎలా సముపార్జించారన్న సంశయం తరచు వేధిస్తూండేది. సమయం దొరికినప్పుడల్లా వాళ్ళిద్దరూ ఆ విషయాన్నే తర్కిస్తూండేవాళ్ళు. శాండిల్యుడు ఒకనాడు చమనుడితో, "మన గురువుగారికి విద్య నేర్పిన బ్రహ్మభట్టారకుడి శిష్యుడు కావడం అంటే, తపస్సుచేసి భగవంతుణ్ణి ప్రత్యక్షం చేసుకోవడం కన్నా దుస్సాధ్యమని లోకమంతా అనుకోవడం నువ్వు వినలేదా ?" అన్నాడు.

"వినకేం, విన్నాను! కాని, నా అభిప్రాయంలో గురువు ఎంతటి గొప్పవాడైనా, అతడొక పునాదిరాయి లాంటివాడు. నిచ్చెనలో మొదటి మెట్టని కూడా అనుకోవచ్చు. మన గురువు ఒక లక్ష తాళపత్రగ్రంథాలు క్షుణ్ణంగా చదివి, వాటిలోని సారాన్ని జీర్ణించుకున్నవారని లోకప్రతీతి కదా! అందుచేత, గురువుగారు లోగడ నిర్విరామంగా సాగించి, ఇప్పటికీ కొనసాగిస్తున్న గ్రంథపఠనమే ఆయన అంతులేని పాండిత్యానికి కారణమని, నా అభిప్రాయం," అన్నాడు చమనుడు.

తర్వాత వాళ్ళిద్దరూ తమ సందేహాలగురించి, గురువుగారినే అడిగారు.

తన శిష్యులిద్దరూ చెప్పింది విన్న శాంతభూషణుడు మందహాసం చేసి, "మీకిలాంటి సందేహం కలగడం, నా అదృష్టమనుకోవాలి. ఎంతకాలంగానో

జొన్నలగడ్డ రత్న



వేదాంతశాస్త్రానికి సంబంధించిన కొన్ని సందేహాలకు, ఎంత ఆలోచించినా నాకు సమాధానం దొరకడం లేదు. ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పగలవారు, నాకు విద్యనేర్పిన గురువు బ్రహ్మభట్టారకులొక్కరే. వారిప్పుడు వృద్ధులయి అనారోగ్యంగా వున్నారు. మీరిద్దరూ కాశీపట్టణానికి వెళ్ళి, వారి దగ్గిర నుంచి, ఈ ప్రశ్నలకు సమాధానాలు అడిగి తెలుసుకు రండి. ఆ తర్వాత నేను, మీ సంశయం తీరుస్తాను,'' అని కొన్ని ప్రశ్నలు పత్రం మీద రాసి వాళ్ళ కిచ్చాడు.

శాంతభూషణుడు చెప్పిన విధంగా శిష్యులిద్దరూ కాశీపట్టణం చేరి, బ్రహ్మభట్టారకుణ్ణి కలుసుకున్నారు. ఆయన శాంతభూషణుడి ప్రశ్నలు పరిశీలించి, చిరునవ్వుతో, ''శాంతభూషణుడి లాంటి ఉద్దండ పండితుడు, నాకు శిష్యుడవడం ఎంతో గర్వకారణమైన విషయం. ఇలాంటి ప్రశ్నలు వేయడం, అతడికి తప్ప మరొకరికి సాధ్యం కాదు. ముదివగ్గునయిన నాకు, ఈ ప్రశ్నలకు సమాధానం ఇవ్వడమన్నది చాలా ప్రయాసతో కూడుకున్న పని. అయినా, నా శిష్యుడి జ్ఞానవికాసానికి తోడ్పడగలిగితే, నాకు అంతకన్న కావలసింది లేదు. మీరు రెండు రోజుల తర్వాత వచ్చి కనిపించండి,'' అని శాండిల్యుణ్ణీ, చమనుణ్ణీ పంపివేశాడు.

రెండు రోజుల తర్వాత వాళ్ళు, బ్రహ్మభట్టారకుణ్ణి దర్శించారు, ఆయన కొన్ని తాళపత్రాలూ, లేఖినులూ వారికిచ్చి, శాంతభూషణుడు అడిగిన ప్రశ్నలకు సమాధానాలు వల్లించసాగాడు.

ఆయన చెప్పింది రాసుకుని, శిష్యులిద్దరూ తిరుగుప్రయాణానికిసిద్ధమవగానే, బ్రహ్మభట్టారకుడు వాళ్ళతో, ''నాయనలారా! శాంతభూషణుడివంటి దిట్టకు శిష్యులయిన మీకు, నేను వివరించి చెప్పనవసరంలేదు. నా సమాధానాలు చూశారుగదా! మీ గురువు అడిగిన ప్రశ్నలకు సమాధానం మానవధర్మ శాస్త్రంలో

లభిస్తున్నది. అయితే, నా సమాధానాల నుంచి మరికొన్ని ప్రశ్నలు ఉత్పన్నమవుతున్నవి. అవి రసాయన శాస్త్రానికి సంబంధించినవి. వాటికి సమాధానం చెప్పగలిగినవాడు, అవంతీనగరంలో వుండే కుమ్మరి పురకాయస్థుడు. మీరతడి నక్కడ కలిసి, ఆ ప్రశ్నలకు సమాధానం రాబట్టినప్పుడే, మీ గురువడిగిన ప్రశ్నలకు పూర్తి సమాధానం లభించగలదు,'' అన్నాడు.



శిష్యులిద్దరూ అవంతీనగరం చేరి, పురకాయస్థుణ్ణి కలుసుకుని సంగతి చెప్పగానే, అతడు పట్టరాని సంతోషంతో ఆయన్ని గురించి కుశలప్రశ్నలడిగి, ''ఆచార్యులవారు, నా చిన్నతనంలో తమ వీధి అరుగు మీద కూర్చుని శిష్యులకు పాఠాలు చెబుతూంటే, వారు చెప్పేది ఆవగింజంత అర్థమయినా, నాబోటివాడికి జన్మ తరిస్తుందన్న ఆశతో, దూరంగా నిలబడి వింటూండేవాడిని.

''ఒక రోజున వారు నన్ను దగ్గిరకు పిలిచి, 'పురకాయస్థా! విజ్ఞానం సంపాయించాలన్న నీ తపన చూస్తున్నాను. కులవిద్యలో నీ ప్రజ్ఞాపాటవాలను గురించి, జనులు చెప్పుకోవడం కూడా విన్నాను. ఏదో ఒకనాడు—సముద్రం లాంటి అపారమైన ఈ జ్ఞానాన్ని తరచిచూసే ప్రయత్నంలో, నీ సహాయం కూడా పొందగలిగే భాగ్యం నాకు కలగవచ్చునేమో!' అంటూ నన్ను ఆశీర్వదించాడు.

''ఆ తర్వాత కొద్ది రోజులకు రాజాశ్రయం లభించగా నేను కాశీపట్టణం వదిలి, అవంతికి తరలివచ్చాను,'' అని వారికి చెబుతూ, బ్రహ్మభట్టారకుడి సందేహాలన్నిటికీ తన సమాధానాలు విశదీకరించాడు.

శిష్యులిద్దరూ పురకాయస్థుడి దగ్గిర సెలవు తీసుకుని, ఉజ్జయినికి బయలుదేరుతూండగా, అతడు వాళ్ళిద్దరితో, ''అయ్యలారా! ఆచార్యులవారడిగిన ప్రశ్నలకు, నా కులవిద్యలోపాటు కలిగిన

అనుభవాన్ని జోడించి సమాధానా లిచ్చాను. శాస్త్రపరంగా అవి సరైన సమాధానాలో కాదో, నాకు తెలియదు. రసాయన శాస్త్రంలో అందుకు సరైన సమాధాన ముంటుందని, పండితులనుకోగావిన్నాను. ఆ శాస్త్రంలో, నా బాల్యమిత్రుడూ, ఆచార్యులవారి ప్రియశిష్యుడూ అయిన శాంతభూషణుడనే పండితుడు గొప్ప నిపుణుడని చెబుతారు. అతడిప్పుడు ఉజ్జయినీ నగరంలో వుంటున్నాడు. నా అభ్యర్థనగా చెప్పి, పూర్తి సమాధానం ఆయన నుంచి తెలుసుకోమని కోరుతున్నాను,'' అన్నాడు.

ఇది విని శాండిల్యుడూ, చమనుడూ ఆశ్చర్యపోయి, పురకాయస్థుడికి, తాము శాంతభూషణుడి శిష్యులమనీ, ఆయన పని మీదనే వచ్చామనీ చెప్పారు.

తర్వాత వాళ్ళు ఉజ్జయిని చేరుకోగానే, తమ గురువుకు జరిగినదంతా చెప్పి, బ్రహ్మభట్టారకుడు—పురకాయస్థుడు ఇచ్చిన సమాధానాలు ఆయనకు చూపించారు.

శిష్యులుచెప్పిందివినిశాంతభూషణుడు చిరునవ్వునవ్వి, ''అందరూ నన్ను గొప్ప పండితుడని పొగడుతూంటారు కదా! చూశారా, నాకు బోధపడని విషయాలు ఎన్ని వున్నాయో? ఇవన్నీ తెలుసుకోవడానికి ఎంత ప్రయత్నమూ, శ్రమపడవలసివచ్చిందో గమనించారా!'' అన్నాడు.

ఆ తర్వాత ఆయన వాళ్ళిద్దరితో, ''జ్ఞానాన్వేషణకు గురువుల సహకారం, గ్రంథాల్లో సంగ్రహపరచిన విషయాలూ ఎంతో అవసరం అన్నది నిస్సందేహం. కాని, తనకు తెలిసినదాని కన్న, తెలియనిది ఎంత వున్నది? అని తనను తానే ప్రశ్నించుకుని, ఆ ప్రశ్నలకు నిరంతరం సమాధానాలు వెదుకుతూ వుండేవాడే నిజమైన పండితుడు!'' అని చెప్పాడు.

శాంతభూషణుడి మాటల్లోని పరమ సత్యాన్ని గ్రహించిన శాండిల్యుడూ, చమనుడూ, గురువు అనుసరించిన బాటలోనే నిరంతరం జ్ఞానాన్వేషణ గావిస్తూ, గొప్ప పండితులుగా పేరు తెచ్చుకున్నారు.






వానర సేనలు విచారగ్రస్తులై వున్నచోటికి విభీషణుడు వచ్చాడు. అతన్ని చూసి ఇంద్రజిత్తు అనుకుని వానరులు చెల్లాచెదరై పరిగెత్తసాగారు. సుగ్రీవుడు ఆజ్ఞాపించగా జాంబవంతుడు వానరులతో, "వచ్చినది విభీషణుడు, ఇంద్రజిత్తు కాడు," అని చెప్పాడు.

రామలక్ష్మణుల స్థితి చూసి విభీషణుడు చాలా బాధ పడ్డాడు. అతనికి తాను లంకకు రాజవుతానన్న ఆశ కాస్తా పోయింది. సుగ్రీవుడు విభీషణుణ్ణి కౌగలించుకుని, "విభీషణా, అప్పుడే రావణుడూ, ఇంద్రజిత్తూ నెగ్గారనుకోను. నువ్వు లంకకు రాజు కాగలవు. రామలక్ష్మణులకు ప్రాణాపాయం లేదు. ఈ మూర్ఛ నుంచి తేరుకోగానే వాళ్ళు శత్రునాశనం చెయ్యగలరు," అన్నాడు.

తరవాత సుగ్రీవుడు తన మామ అయిన సుషేణుడితో, "రామలక్ష్మణులు మూర్ఛ తేరగానే వీళ్ళనూ, కొందరు వానర వీరులనూ తీసుకుని కిష్కింధకు వెళ్ళిపో. నేను రావణుణ్ణి సకుటుంబంగా చంపి, సీతను తీసుకుని వస్తాను," అన్నాడు.

సుషేణుడు సుగ్రీవుడితో, "పూర్వం దేవదానవ యుద్ధాలు జరగటం నాకు తెలుసు. అప్పుడు కూడా రాక్షసులు మాయాయుద్ధాలు చేసి దేవతలను చాలా మందిని పడగొట్టారు. కొందరు దేవతలు మూర్ఛపోయారు, కొందరు చచ్చి



పోయారు. అప్పుడు దేవతల గురువైన బృహస్పతి మృతసంజీవనీవిద్యతోనూ, మూలికలతోనూ వారికి చికిత్స చేశాడు. సంజీవకరణీ, విశల్యకరణీ అనే ఓషధులు పాలసముద్రం వద్ద కొండలలో ఉంటాయి. పూర్వం క్షీరసాగరమథనం జరిగిన చోట చంద్రపర్వతమూ, ద్రోణ పర్వతమూ ఉన్నాయి. వాటి మీదనే ఈ ఓషధులు ఉంటాయి. అక్కడికి హనుమంతుణ్ణి పంపించు," అన్నాడు.

ఇంతలో ప్రళయంగా గాలి వీచింది. వానరులకు గరుత్మంతుడు వస్తూ కనిపించాడు. గరుత్మంతుడు రావటం చూసి, రామలక్ష్మణులను బాణాల రూపంలో బంధించి ఉండిన సర్పాలు భయపడి పారిపోయాయి.

గరుత్మంతుడు రామలక్ష్మణుల వద్ద దిగి, వారి ముఖాలూ, శరీరాలూ నిమిరాడు. వెంటనే వాళ్ళ గాయాలు నయమయ్యాయి.

రాముడు అతనితో, "మీ దయవల్ల మేము తిరిగి ఎప్పటి లాగా బలవంతుల మయ్యాం. మిమ్మల్ని చూస్తుంటే మా తండ్రి దశరథమహారాజునూ, మా తాత అజమహారాజునూ చూసినంత ఆనందం కలుగుతున్నది. మీ దివ్యవస్త్రాలూ, ఆభరణాలూ చూడగా ఆశ్చర్యం కలుగుతున్నది. మీ రెవ్వరు ?" అన్నాడు.

గరుత్మంతుడు ఆనంద బాష్పాలు రాల్చుతూ, "రామా, నేను నీకు స్నేహితుణ్ణి; ఇష్టుణ్ణి; నీ ప్రాణం లాటి వాణ్ణి; నా పేరు గరుత్మంతుడు. మీ ఇద్దరికీ సహాయం చెయ్యటానికే వచ్చాను. ఈ బాణపాశాలు నిజానికి సర్పాలు. వీటిని వదిలించటం అందరికీ సాధ్యం కాదు. అందుకే మీ స్థితి గురించి వినగానే పరిగెత్తుకుంటూ వచ్చాను! మిమ్మల్ని విడిపించాను. ఈ యుద్ధంలో మీరు ఏ మాత్రమూ ఏమరుపాటుగా ఉండరాదు. రాక్షసులను నమ్మరాదని ఇప్పుడు మీకే తెలిసివచ్చింది గదా!" అన్నాడు.



తరవాత గరుత్మంతుడు వెళ్ళిపోవటానికి రాముడి వద్ద సెలవు పుచ్చుకుంటూ, "నేను నీకు ఎలా స్నేహితుణ్ణని ఇప్పుడు అడగకు. ఈ యుద్ధంలో గెలిచిన అనంతరం ఆ సంగతి నీకే తెలుస్తుంది. యుద్ధం అయిపోయాక లంకలో పసివాళ్ళూ, ముసలివాళ్ళూ మాత్రమే మిగులుతారు. రావణుడు చస్తాడు. సీత నీకు దక్కుతుంది," అని చెప్పి, ఆకాశమార్గాన ఎగిరి వెళ్ళిపోయాడు.

రామలక్ష్మణులు మామూలు మనుషులు కాగానే వానరులు తోకలు ఎగరేస్తూ సింహనాదాలు చేశారు. భేరీలూ, మృదంగాలూ మోగాయి. వానరులు చెట్లు పీకి, లంకాద్వారాలను ముట్టడించారు. అప్పటికి అర్ధరాత్రి అయింది.

ఆ నిశిరాత్రివేళ వానరులు సింహనాదాలు చెయ్యటం రావణుడూ, రాక్షసులూ విన్నారు. రావణుడు తన మంత్రులతో, "వానరులు మహా ఆనందంలో ఉన్నట్టున్నారు. రామలక్ష్మణుల కోసం ఏడుస్తూ ఉండవలసిన వాళ్ళు సంతోషంగా ఎందుకున్నారు?" అని వానరుల ఉత్సాహానికి కారణం తెలుసుకు రావటానికి రాక్షసులను పంపాడు.

వాళ్ళు వెళ్ళి ప్రాకారాలు మీదికి ఎక్కి, వానరసేననూ, బాణపాశాలు వదిలి సుఖంగా ఉన్న రామలక్ష్మణులనూ చూసి రావణుడి వద్దకు తిరిగి వెళ్ళి, తాము చూసినది చెప్పారు.

రామలక్ష్మణులు ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణబంధాల నుంచి బయటపడ్డారని విని రావణుడు వెలవెలపోయాడు. వాసుకి లాటి బాణాలు నిష్ఫలమయ్యాయి. అతను ధూమ్రాక్షుడనే వాడితో, "నువ్వు పెద్దసేనతో వెళ్ళి, వానరులనూ, రాముణ్ణీ చంపిరా!" అన్నాడు.

ధూమ్రాక్షుడు వెంటనే బయలుదేరి వెళ్ళి, సేనాధ్యక్షుడితో, తాను యుద్ధానికి పోతున్నాననీ, తన కోసం సేనను సిద్ధం



చెయ్యమనీ చెప్పాడు. ధూమ్రాక్షుడికి సేన సిద్ధమయింది. రకరకాల ఆయుధాలు ధరించిన రాక్షసులు ఆ సేనలో ఉన్నారు. వారిని వెంట బెట్టుకుని, ఉత్తమమైన రథం ఎక్కి ధూమ్రాక్షుడు పడమటి ద్వారం వద్దకు వెళ్ళాడు.

ధూమ్రాక్షుడు రావటం చూస్తూనే వానరులు సింహనాదాలు చేశారు. ఉభయ పక్షాలకూ పోరు ప్రారంభమయింది. రాక్షసుల ఆయుధాల చేత దెబ్బలు తింటూ వానరులు రాక్షసులను చెట్లతోనూ, గండ రాళ్ళతోనూ కొట్టారు. మొత్తం మీద రాక్షసులే ఎక్కువ నష్టపడి, పారిపోసాగారు. అది చూసి ధూమ్రాక్షుడు వానరులను హింసించ నారంభించాడు. వానరులు కూడా అధిక సంఖ్యలో చచ్చారు.

ధూమ్రాక్షుడు వానరసేనలను నష్టపరచటమే గాక, తరమటం చూసి హనుమంతుడికి చాలా కోపం వచ్చింది. అతను పెద్ద శిలను తీసుకుని ధూమ్రాక్షుడి మీదికి పోయి, అతని రథం మీద విసిరి కొట్టాడు. రథం ధ్వంసమయింది. రథం మీద పడే ఆ శిలను చూస్తూనే ధూమ్రాక్షుడు గద తీసుకుని, నేల మీదికి దూకి నిలబడ్డాడు.

తరవాత హనుమంతుడు చెట్ల బోదెలూ కొమ్మలూ తీసుకుని, రాక్షసులను ఎడాపెడా చదును చెయ్యసాగాడు. రాక్షసులు పారిపోయారు. తరవాత హనుమంతుడు ధూమ్రాక్షుడి పైకి వచ్చాడు.

ధూమ్రాక్షుడు గదతో హనుమంతుణ్ణి ఎదుర్కొని, దానితో హనుమంతుడి తల మీద కొట్టాడు. హనుమంతుడు ఆ దెబ్బను లక్ష్యపెట్టక, ధూమ్రాక్షుడి మీద ఒక పర్వత శిఖరాన్ని వేశాడు. ఆ దెబ్బకు ధూమ్రాక్షుడు చచ్చాడు. అది చూసి వానరులు మరింత ఉత్సాహంగా రాక్షసుల మీద పడ్డారు. రాక్షసులు భయపడి లంకలోకి పారిపోయారు.

ధూమ్రాక్షుడు చచ్చినట్టు విని రావణుడికి అమిత కోపం వచ్చింది. అతను వజ్రదంష్ట్రుడనే వాణ్ణి చూసి, "నువ్వ

వెంటనే వెళ్ళి, రాముణ్ణీ, సుగ్రీవుణ్ణీ, అందరు వానరులనూ చంపిరా!'' అన్నాడు.

వజ్రదంష్ట్రుడు మాయలు నేర్చినవాడు. అతను సైన్యాన్ని తీసుకుని, కవచం ధరించి, ధనుర్బాణాలు తీసుకుని, రథం మీద యుద్ధానికి బయలుదేరాడు. అతని వెంట మంచి మంచి అస్త్రాలు ధరించిన రాక్షసవీరులు బయలుదేరారు.

వజ్రదంష్ట్రుడి రాక్షస సేనలు లంకా నగరపు దక్షిణద్వారం గుండా బయటికి వచ్చాయి. ఆ ద్వారాన్ని ముట్టడించినది అంగదుడు. వానర రాక్షసుల మధ్య భయంకరమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రాక్షసులు అనేకమంది వానరులను చంపటం చూసి అంగదుడు మండిపడి, దారుణంగా రాక్షసవధ సాగించాడు. అతని దెబ్బలకు అందుబాటులోకి వచ్చిన రాక్షసుల తలలు ఒక్కొక్క దెబ్బకే పగిలిపోయాయి.

అంగదుడి దెబ్బకు తట్టుకోలేక రాక్షస బలాలు చిందర వందర కావటం చూసి వజ్రదంష్ట్రుడికి కోపం వచ్చింది. అతను వానరసేన మీద బాణవర్షం కురిపించాడు. చివరకు అంగదుడూ, వజ్ర దంష్ట్రుడూ ఒకరి నొకరు ఎదుర్కొనటం జరిగింది. వారి మధ్య జరిగిన ద్వంద్వ



యుద్ధంలో అంగదుడు వజ్రదంష్ట్రుడి రథాన్ని ఒక శిలతో ధ్వంసం చేశాడు. వజ్రదంష్ట్రుడు గద తీసుకుని నేలపైకి దూకి, వెంటనే కొంతసేపు మూర్ఛపోయాడు.

మూర్ఛనుంచి బయటపడుతూనే వజ్రదంష్ట్రుడు తన ఎదురుగా నిలిచి ఉన్న అంగదుడి రొమ్ము కేసి గద విసిరాడు. అటు తరువాత ఇద్దరూ ముష్టియుద్ధానికి దిగారు. ఇద్దరూ చాలాసేపు పోరాడి, అలసిపోయి మోకాళ్ళ మీద కూర్చుని ఉన్న సమయంలో అంగదుడు అకస్మాత్తుగా లేచి, వజ్రదంష్ట్రుడి తలను ఖడ్గంతో ఖండించాడు. వానరులు సంతోషించారు.



వజ్రదంష్ట్రుడు చచ్చినట్టు విని రావణుడు అకంపనుణ్ణి సేనతోసహా యుద్ధానికి పంపాడు. ఆ ప్రకారమే అకంపనుడు మంచి రథం మీద, సేనను వెంటబెట్టుకుని బయలుదేరాడు.

మళ్ళీ రాక్షసులకూ, వానరులకూ తీవ్రమైన యుద్ధం జరిగింది. రెండు పక్షాలా అనేకమంది చచ్చారు. కుముదుడూ, నలుడూ, మైందుడూ, ద్వివిదుడూ అనే వానరవీరులు విజృంభించి రాక్షసులను చంపసాగారు.

అకంపనుడు ఆ వానరవీరులను గమనించి, తన రథాన్ని వారివైపు తోలించాడు. అకంపనుడి ముందు వానరులు నిలవలేకపోవటం చూసి, హనుమంతుడు ముందుకు వచ్చాడు. అకంపనుడు హనుమంతుడి పైన బాణవర్షం కురిపించాడు. హనుమంతుడు ఆ బాణాలను లక్ష్యపెట్టక గట్టిగా సింహనాదం చేసి, భూమి అదిరేలాగ కాలుతాటిస్తూ, ఒక పెద్ద శిల తీసుకుని, అకంపనుడి మీదికి వెళ్ళాడు.

కాని అకంపనుడు తన బాణాలతో హనుమంతుడి చేతిలోని శిలను తుంపులు తుంపులు చేశాడు. హనుమంతుడు ఒక మద్దిచెట్టును పెకలించి, దానితో అకంపనుడి నెత్తి మీద కొట్టాడు. ఆ దెబ్బతో అకంపనుడు చచ్చి పడిపోయాడు.

రాక్షసులు ఇది చూసి భయపడి, తమ చేతుల్లోని ఆయుధాలు అక్కడే పారేసి, లంకలోకి పారిపోయారు.

అకంపనుణ్ణి చంపినందుకు హనుమంతుణ్ణి వానరవీరులు ఎంతగానో ప్రశంసించారు. హనుమంతుడు వాళ్ళను అభినందించాడు. వానరులు రాక్షసుల గుండెలు అదిరేటట్టు సింహనాదాలు చేశారు.

అకంపనుడు చచ్చాడని విని రావణుడు కొంచెంసేపు విచారించి, మంత్రులతో సంప్రతించి, తన సేనావ్యూహాలను పరీక్షించటానికి లంక అంతా తిరిగాడు. లంక అంతటా రాక్షసుల జెండాలు ఎగురు

తున్నాయి. నగరం చుట్టూ వానర సేనలు ముట్టడివేసి ఉన్నాయి.

రావణుడు సభా భవనానికి తిరిగి వచ్చి, ప్రహస్తుణ్ణి చూసి, "శత్రుసైన్యాలు వచ్చి మన నగరాన్ని ముట్టడిస్తే, దాన్ని విడిపించటానికి ఇతరులు చేసే ప్రయత్నం నిరర్థకమని తోస్తుంది. ఆ పని చెయ్యగల వాళ్ళం నేనూ, కుంభకర్ణుడూ, నువ్వూ, ఇంద్రజిత్తూ, నికుంభుడూ మాత్రమే. నువ్వు తగిన సేనను వెంట తీసుకుపోయి, వానర సేనను జయించిరా," అన్నాడు.

అందుకు ప్రహస్తుడు ఇలా అన్నాడు:

"ఇది ముందు చర్చించిన సంగతే గద! దీన్ని గురించి మనకు మనస్పర్థ కూడా వచ్చింది. సీతను రాముడికి ఇచ్చెయ్యటం క్షేమమని నాకు తెలిసినదే, లేకపోతే యుద్ధం తప్పదన్న సంగతి కూడా ముందే తెలుసు. అయితే నీకు ఇష్టమైన పని చేయటానికి నేను ఎప్పుడూ సిద్ధమే. నీ కోసం యుద్ధంలో ప్రాణాలు కూడా విడుస్తాను."

ఇలా అని, సేనానాయకుడైన ప్రహస్తుడు పెద్ద సేనను బయలుదేరతియమని సేనాధ్యక్షులకు ఉత్తరువు ఇచ్చాడు. రాక్షసవీరులు విజయం కోరి హోమాలు చేసి, బ్రాహ్మణులను అర్చించి, యుద్ధానికి కదిలారు. ప్రహస్తుడు భేరీ మోగించి, గుర్రాలు పూన్చిన రథం మీద బయలుదేరాడు. అతని వెంట అతని నలుగురు మంత్రులూ, నరాంతకుడూ, కుంభహనుడూ, మహానాదుడూ, సమున్నతుడూ అనేవాళ్ళు బయలుదేరారు.

రాముడు ప్రహస్తుడు రావటం చూసి విభీషణుడితో, "ఆ వచ్చే రాక్షసుడు చాలా పరాక్రమవంతుడు లాగా కనబడతాడు. ఎవరతను?" అన్నాడు.

"అతను రావణుడి సేనానాయకుడు ప్రహస్తుడు. రావణుడి సేనలో మూడో వంతు ఇతని కింద ఉంటుంది. ఇతను అస్త్రాలు తెలిసినవాడు. పరాక్రమవంతుడుగా ప్రసిద్ధి కలవాడు," అని విభీషణుడు రాముడికి చెప్పాడు.






ఒక ఊళ్ళో భీమన్న అనేవాడు ఒకడు ఉండేవాడు. వాడికి లోకజ్ఞానం బొత్తిగా లేదు. కూలిపని చేసి బతుకుతూ ఉండే వాడు. ఊళ్ళోవాళ్ళు వాణ్ణి వెర్రి అమాయ కుడి కింద జమకట్టేవాళ్ళు.

ఒక రాత్రి భీమన్న తిండి తిని, వెన్నెట్లో మంచం వేసుకుని, వెల్లికిలా పడుకుని ఆకాశం కేసి చూశాడు. అకస్మాత్తుగా వాడి కొక భయంకరమైన ఊహ తట్టింది:

''ఆకాశం, ప్రపంచానికి దేవుడు వేసిన పందిరి అంటారు గదా! ఎంత చిన్న పందిరి కన్నా నాలుగు గుంజ లుంటాయి గదా! ఇంత పెద్ద ఆకాశానికి ఒక్క గుంజ అయినా లేదే! విరిగిపడితే ఇంకేమైనా ఉందా!''

భీమన్న భయంతో లేచి కూర్చున్నాడు. ఆకాశం విరిగి మీద పడితే తన ప్రాణాలు పోతాయన్న భయం వాణ్ణి పట్టుకున్నది. ఎవరితో నన్నా చెప్పకుందామన్నా అందరూ నిద్రపోతున్నారు. భీమన్న పరిగెత్తుకుంటూ పోయి ఊరిబయట ఉన్న ఊడలమర్రి కింద కూర్చున్నాడు. ఆకాశం పడితే చెట్టు కొమ్మలు అడ్డి, తన ప్రాణాలు కాపాడతా యని వాడి ఉద్దేశం. ఆ రాత్రంతా వాడు ఆ చెట్టు కిందనే జాగారం చేశాడు.

తెల్లవారింది. భీమన్న ఊళ్ళోకి తిరిగి వచ్చి, కనిపించిన ప్రతివాడితోనూ, ''చిన్న పందిరికే నాలుగు గుంజలుంటే, ఇంత పెద్ద ఆకాశానికి ఎన్ని గుంజలుండాలి? ఒక్కటీ లేదే! అది మీద పడితే మన మంతా చచ్చిపోమా? మనమంతా ఆకాశం లేని చోటికి పోదాం!'' అన్నాడు.

''వీడి కేదో పిచ్చి పట్టింది!'' అని అందరూ నవ్వుకున్నారు. అంతే కాని, భీమన్న మాటలను ఒక్కరూ లక్ష్యపెట్టలేదు.

''వీళ్ళు పిచ్చికుంకలు. బతికే యోగ్యత లేక వాళ్ళు నా మాట వినకుండా ఉన్నారు.



నడిచినా అడవి తరగటం లేదు. ఎక్కడా ఊరు తగలలేదు. భీమన్న ఒక చోట ఆగి తల ఎత్తి చూస్తే, చెట్ల మీదుగా ఆకాశం కనిపించింది; ఆకాశం లేని చోటు చేరాలంటే ఇంకా నడవాలి లాగున్నది.

చీకటి పడే దాకా నడిచి భీమన్న, ఆ రాత్రి గడపటానికి పెద్ద చెట్టు కిందికి వచ్చాడు, ఆకాశం పడినా చెట్టుకొమ్మలు తన ప్రాణాలను కాపాడతా యనుకుని.

ఆ చెట్టు కింద ఒక మనిషి కళ్ళు మూసుకుని కూర్చుని ఉండి, భీమన్న వచ్చిన అలికిడికి కళ్ళు తెరిచి, అతడి కేసి చూశాడు. ఆయన ఒక యోగి.

ఒకరితో నా కెందుకు? నేను ఆకాశం లేని చోటుకు పోయి హాయిగా బతుకుతాను.'' అనుకుని భీమన్న ఆ వూరి నుంచి బయలుదేరాడు.

ఊరుదాటినాక అడవి వచ్చింది. అడవి దారిన ఒకరూ, ఇద్దరూ భీమన్నకు ఎదురయ్యారు. ఉండబట్టలేక భీమన్న తన భయాన్ని ఒక మనిషికి చెప్పుకున్నాడు. ఆ మనిషి, ''నీ కేమన్నా మతిపోయిందా ఏమిటి? ఆకాశానికి గుంజలేమిటి?'' అంటూ ముందుకు సాగిపోయాడు.

ఇంత చిన్న విషయాన్ని కూడా ఎవరూ అర్థం చేసుకోనందుకు చిరాకుపడుతూ భీమన్న ముందుకు సాగాడు. ఎంత దూరం

భీమన్న ఆయనను చూడగానే, ''మీరు కూడా ఆకాశం పడుతుందనేనా, ఇంత దూరం వచ్చి ఈ చెట్టు కింద చేరారు? భలే!'' అన్నాడు.

వాడు పిచ్చివాడని గ్రహించి యోగి చిరునవ్వు నవ్వుతూ, ''ఆకాశం పడట మేమిటి?'' అని అడిగాడు.

''చిన్న పందిరికే నాలుగు గుంజ లుంటాయి గదా! ఇంత పెద్ద ఆకాశం గుంజలు లేకుండా ఎంతకాలం పడకుండా వుంటుందీ?'' అన్నాడు భీమన్న.

''అదా నీ అనుమానం? ఆకాశానికి గుంజలు లేకపోవట మేమిటి, నాయనా? ఉన్నాయి! వాటి సంగతి తెల్లవారినాక

చెబుతాను. ఈ రాత్రికి పడుకుని నిద్రపో,'' అన్నాడు యోగి.

యోగి మాట నమ్మి భీమన్న ఆ రాత్రి నిశ్చింతగా నిద్రపోయాడు.

తెల్లవారింది. భీమన్న లేవగానే యోగి, ''నాయనా, ఆకాశానికి గుంజలు లేవని కాదూ, నీ అనుమానం? అది తీరే పద్ధతి నీకు చెబుతాను. ఇటుగా వెళ్ళావంటే ఒక గ్రామం వస్తుంది. ఆ గ్రామంలో ప్రతి ఇంటికీ వెళ్ళి, ఇంట్లో వాళ్ళను నోటికి వచ్చినట్టు తిట్టి, బిచ్చం పెట్టించుకుని తిరిగి రా!'' అన్నాడు.

భీమన్న ఆయన చెప్పిన మార్గాన వెళ్ళి, ఊరు చేరుకుని, ఒక్కొక్క ఇంటి ముందూ ఆగి, ఇంట్లోవాళ్ళను తిడుతూ బిచ్చం పెట్టమని అడగసాగాడు. అందరూ వాణ్ణి కొట్టబోయినవాళ్ళే గాని, ఒక్కరూ బిచ్చం పెట్టలేదు. ఆఖరికి వాడు మరొక ఇంటి ముందుకు వెళ్ళి, బిచ్చం వెయ్యమని అరిచాడు. లోపలి నుంచి జవాబు లేదు. భీమన్న తిట్లు ప్రారంభించాడు.

ఇంతలో ఒక స్త్రీ దోసిట్లో బియ్యం తీసుకుని పరిగెత్తుకుంటూ వచ్చి, ''ఆలస్యం అయింది, నాయనా! ఆకలితో అలమటించేవాడివి తిట్టావంటే తిట్టవూ?'' అంటూ, బియ్యం భీమన్న ఒడిలో పోసి, లోపలికి తిరిగి వెళ్ళింది.

భీమన్న అరణ్యంలోకి తిరిగి వెళ్ళి, యోగితో జరిగినదంతా చెప్పాడు.

యోగి నవ్వి, ''చూశావా? నువ్వు తిట్టినా ఆ మహాఇల్లాలు కోపం తెచ్చుకోకుండా నీకు బిచ్చం పెట్టింది. అటువంటివాళ్ళు నూటికీ, కోటికీ ఒకరున్నా చాలు. వాళ్ళే ఆకాశానికి గుంజలు. పందిరికి నాలుగే గుంజలు, కాని ఆకాశానికి ఇలాంటి గుంజలు ఎన్నో వున్నాయి. అందుకే ఆకాశం పడిపోదు,'' అన్నాడు.

భీమన్నకు ఆయన మాటలు అర్థమయ్యాయి. తన భయాన్ని తీర్చిన ఆ యోగికి సాష్టాంగపడి నమస్కారం చేసి, ఆయనకు శుశ్రూషలు చేస్తూ, భీమన్న ఆ అరణ్యంలోనే ఉండిపోయాడు.





# చావు రాని వాడు

పూర్వం ఇటలీదేశంలో బెప్పో పిపెట్టా అనే ఒక సాహసవంతుడైన యువక సైనికుడుండేవాడు. వాడొకనాడు నిర్జనమైన అరణ్యంగుండా పోతూండగా ఒక చోట ఒక వర్తకుణ్ణి ఇద్దరు దొంగలు పట్టి కొట్టుతూండటం కంట పడింది. వెంటనే బెప్పో పులి లాగా ఆ దొంగలపై విరుచుకు పడేసరికి, వాళ్ళు పరారీ అయిపోయారు. వర్తకుడు గాయపడలేదని రూఢి చేసుకుని, ఆయన పరిచయమైనా చేసుకోకుండా బెప్పో తన దారిన వెళ్ళిపోయాడు.

బెప్పో ప్రదర్శించిన ఈ సాహసం అతనికెంతో లాభించింది. ఎందుకంటే అలా దొంగలపాలపడినవర్తకుడుమరెవరో కాదు; మారు వేషంలో తిరుగుతున్న రాజే! ఆయన బెప్పో చేసిన మేలుకు కృతజ్ఞత కలిగి ఉండటమేగాక, అతని ధైర్యసాహసాలకు ముచ్చటపడి, బెప్పోను పిలిపించి, ''ఇకనుంచీ నువ్వు నిర్బంధ సైనికుడివి కావు. నీ కిష్టమైనప్పుడు యుద్ధం చెయ్యవచ్చు లేకుంటే మానవచ్చు; ఎక్కడైనా తిరగవచ్చు. ఎలాగైనా జీవించవచ్చు. నిన్ను మటుకు నేను యావజ్జీవమూ పోషించి, నీ ఖర్చంతా భరిస్తాను,'' అన్నాడు.

బెప్పోకు ఇంతకంటే కావలిసినది లేదు. అతను ఇంత కాలమూ మోసిన సైనిక సంచీని దూరంగా గిరవాటు వేసి, నిశ్చింతగా, యథేచ్ఛగా, ఆనందంగా జీవించసాగాడు. అతనికొక నాడొక ముసలి సైనికుడు జతపడి, ''నువ్వు సైనికుడివైతే సంచీ ఏదీ ?'' అని అడిగాడు.

''సైనికుడుగా పని చెయ్యకుండానే మా యజమాని నన్ను పోషిస్తానన్నాడు,'' అన్నాడు బెప్పో.

''అదృష్టవంతుడివి. అయితే, నా సంచీ ఇస్తాను తీసుకో. అది మామూలు సంచీ

ఇటలీ జానపద కథ

కాదు. దీని మూతి విప్పి, ఎదురుగా ఉన్న వాణ్ణి 'దూకు' అనగానే ఆ మనిషి సంచీ లోకి దూకేస్తాడు. నువ్వు దాని మూతి విప్పే దాకా పైకి రాలేడు. ఎన్నో ఏళ్ళుగా ఈ సంచీతో ఆడుకున్నాను. మొహం మొత్తి పోయింది. యువకుడివి కనక దీనితో కొంతకాలం నువ్వు కూడా ఆడుకో,'' అని ముసలి సైనికుడు తన వద్ద ఉన్న పెద్ద సంచీని బెప్పో కిచ్చేశాడు.



బెప్పో ఆ సంచీలో నిజంగా మహిమ ఉన్నదని రుజువు చేసుకున్నాడు. తనతో పోట్లాట పెట్టుకున్న వారిని ఒకరిద్దరిని, ''దూకు,'' అనగానే ఆ సంచీలోకి దూకి, అతను విడిపించిన దాకా అందులోనే ఉండిపోయారు.

అతను రెండేళ్ళు తన గ్రామంలో గడిపిన తరవాత కాలు దురద పెట్టింది. అందుచేత అతను మళ్ళీ రాజధానికి తిరిగి వచ్చాడు. నగరమంతా విచార సూచకంగా ఉన్నది. ప్రతి ఇంటికీ నల్లగుడ్డలు వేల్లాడుతున్నాయి. అతను ఇందుకు కారణమేమిటని అడగగా, ''నీకు తెలీదా? ఇవాళ అర్ధరాత్రికి సైతాను వచ్చి రాజకుమార్తెను ఎత్తుకు పోతున్నాడు. కొన్ని ఏళ్ళ క్రితం మన రాజుగారి చేత ఈ సైతాను ఒక కాగితం పైన సంతకం చేయించుకున్నాడు. అందులో ఏమున్నదీ రాజుగారికి సరిగా అర్థం కాక, భ్రమపడి సంతకం పెట్టారు. తీరా చూస్తే రాజుగారి కూతుర్ని ఇవాళరాత్రి సైతాను కివ్వాలని అందులో ఉన్నది.'' అని నగరవాసులు చెప్పారు.

వెంటనే బెప్పో రాజుగారి వద్దకు వెళ్ళి, ''మీరు నాకు చేసిన మహోపకారానికి బదులుగా తమ కుమార్తెను సైతాను వాత పడకుండా తప్పిస్తాను,'' అన్నాడు.

''నీ సాహసం నాకు తెలుసుననుకో. అయినా, ఈ సందర్భంలో నువ్వు గాని మరొకరు గాని చేయగలదేమీ లేదు. మభ్యపడే అయినప్పటికీ, కాగితం మీద సంతకం చేశాను,'' అన్నాడు రాజు.



మూతి విప్పి సిద్ధంగా ఉంచి, గవాక్షం తెరిచి, దాని వద్ద బెప్పో నిలబడి ఉన్నాడు.

సరిగా అర్ధరాత్రివేళ భూమి కంపించింది. మెరుపులు మెరిశాయి, ఉరుములు వినవచ్చాయి. అంతటా గంధకం వాసన వ్యాపించింది. రాజభవనంలోకి రాలుడు నక్షత్రంలాగా దూసుకు వస్తున్న సైతానును "దూకు" అని బెప్పో అనేసరికి, సైతాను సూటిగా వచ్చి అతని సంచీలో పడిపోయాడు. వెంటనే బెప్పో సంచీ మూతి బిగించాడు.

సంచీలో చిక్కన సైతాను కాస్సేపు గర్జించి మౌనం వహించిన మీదట బెప్పో, "ఏం ఇలా వచ్చావు?" అని అడిగాడు.

"అది నీకు సంబంధించిన విషయం కాదు," అన్నాడు సైతాను సంచీలోనుంచి.

"పూర్తిగా నాకు సంబంధించిన విషయం. నువ్వు రాజుగారి కుమార్తెను కాజేసుకు పోదామని వచ్చావు; నీ ప్రయత్నం పడగొట్టాలని నేను వచ్చాను! రాజకుమార్తె జోలికి రానని మాట ఇయ్యి. నిన్ను సంచీలో నుంచి బయటికి రానిస్తాను," అన్నాడు బెప్పో.

"అదంతా వట్టి మాట. ఇవాళ అర్ధరాత్రి దాటినప్పటి నుంచీ రాజకుమార్తె నా సొత్తు. అలా అని రాజుగారు నాకు

"ఆ పాటి మోసం మనమూ చెయ్యవచ్చు. రాజకుమార్తె ఉండే గదికి పక్క గది నాకు ఏర్పాటు చెయ్యండి. అంటే, సైతాను నా గది దాటితేగాని రాజకుమార్తె గదికి పోవటానికి లేకుండా ఉండాలి. నా కొక బల్లా, మంచి దుడ్డుకర్రా, కలమూ, కాగితమూ, సిరాబుడ్డీ దయచేయించండి. మిగిలినదంతా నేను చూసుకుంటాను," అన్నాడు బెప్పో.

బెప్పో ప్రమాదం నివారించగలడని రాజుగారి కేకోశానా నమ్మకం లేదు. అయినా, ఆయన అతను కోరిన ఏర్పాట్లన్నీ చేశాడు. రాజకుమార్తె ఉండే గదికి పక్క గదిలో చేరి, బల్ల మీద తన సంచీని

పత్రం రాసి సంతకం చేసి ఇచ్చాడు,'' అన్నాడు సైతాను.

''ఆ సంగతి నాకు తెలుసు. ఆ ఒప్పందం చించేస్తావా, లేదా? ఆఖరుసారి అడుగుతున్నాను,'' అన్నాడు బెప్పో.

''నా వ్యవహారాలలో జోక్యం కలిగించుకోకు. ముందు నన్ను సంచీ నుంచి బయటికి రానీ,'' అన్నాడు సైతాను.

''సరే అయితే!'' అని బెప్పో దుడ్డు కర్రతో సంచీని బాదసాగాడు.

నరకలోకానికి ప్రభువైన సైతాను తన లోకంలో శరీరబాధలకు అతీతుడు. కాని మానవలోకానికి రావాలంటే మానవ సహజమైన గుణాలు గల శరీరాన్ని ధరించి మరీ రావాలి. అందుచేత సైతానును దుడ్డు కర్ర దెబ్బలు బాధ పెట్టాయి. ఆ బాధతో సైతాను అరిచాడు, ఆక్రోశించాడు. చివరకు కాళ్ళ బేరానికి వచ్చి, తనను సంచీలో నుంచి పైకి రానిచ్చినట్టయితే రాజకుమార్తె జోలికి రానన్నాడు.

“నువ్వుపత్రాలపైసంతకాలుచేయించుకునేవాడివి. నీ నోటి మాటకు విలువలేదు. నేను పత్రం తయారు చేస్తాను. నీ చెయ్యి బయట పెట్టి దాని పైన సంతకం చెయ్యి. ఆ తరవాతనే నిన్ను వదిలిపెట్టేది,'' అంటూ బెప్పో ఒక పత్రం తయారు చేసి దానిపై సైతాను చేత సంతకం చేయించి, ఆ తరవాత సైతానును సంచీ నుంచి పైకి రానిచ్చాడు. గంధకం వాసనలు వెదజల్లుతూ ఒక్క మెరుపు మెరిసింది;





సైతాను గదిలో నుంచి నిష్క్రమించాడు. తరవాత రాజుగారూ, ఆయన కుమార్తె కొలువులో వున్నవాళ్ళూ తన చుట్టూ చేరి తెగ మెచ్చుకుంటూంటే బెప్పో సిగ్గుతో తల వంచేసుకున్నాడు. అతని గౌరవార్థం రాజుగారు బ్రహ్మాండమైన విందు చేసి అతన్ని సాగనంపాడు.

మళ్ళీ బెప్పోకు దేశాటన మోహం మొత్తింది. అతను ఒక చోట స్థిరపడ దలుచుకుని తనకు నచ్చే చోటు కోసం అంతటా వెతికి, చివరకు ఒక నది ఒడ్డున ఒక అందమైన కుటీరం చూశాడు. దాని చుట్టూ అందమైన పూలతోటా, పళ్ళ తోటలూ ఉన్నాయి.

ఆ కుటీరంలో అతను స్థిరనివాసం ఏర్పాటు చేసుకుని, దేశాటనలు మానేసి, బతికి ఉన్నంత కాలమూ అక్కడే సుఖంగా ఉండ నిశ్చయించాడు.

చాలా ఏళ్ళు గడిచాయి. అతనికి జీవితం హాయిగా జరిగింది. ఒక నాడతని వద్దకు ఒక కొత్త వ్యక్తి వచ్చాడు. అతను నల్లగా, ప్రశాంతంగా, విచారవదనుడై ఉన్నాడు.

"ఎవరు మీరు ?" అని బెప్పో అతణ్ణి అడిగాడు.

"మృత్యువును," అని ఆ వ్యక్తి జవాబు చెప్పాడు.

"ఓహో, అలా అయితే—దూకు!" అంటూ బెప్పో తన సంచీ మూతి విప్పాడు. మృత్యువు అందులోకి దూకి, ఏణ్ణర్థం పాటు అందులోనే ఉండిపోయాడు.

అంత కాలమూ బెప్పో మృత్యువును ఏ విధంగానూ బాధించలేదు; మీదు మిక్కిలి మృత్యువుతో స్నేహపూర్వకంగా మాట్లాడాడు. మృత్యువే అతన్ని భయ పెట్టీ, అతనితో వాదించీ, అతన్ని బతిమాలీ సంచీలో నుంచి బయటపడ యత్నించాడు. బెప్పో అందుకు మాత్రం సమ్మతించలేదు.

ఆ ఏణ్ణర్థం కాలంలోనూ లోకంలో ఒక్క ప్రాణి కూడా చావలేదు. ఇవాళో,

రేపో, ఇంకో గంటకో పోతారనుకున్నవారు అలా జీవించే ఉండిపోయారు. ఎన్నో ప్రమాదాలూ, యుద్ధాలూ జరిగాయి. కాని ఒక్కరూ చావటం జరగలేదు.

మృత్యువు బెప్పోకు ఎన్ని విధాలో చెప్పి చూశాడు: చావు లేకుండా లోకయాత్ర సాగదు; అతి వృద్ధు లుంటారు, దీర్ఘ వ్యాధులు గలవా రుంటారు, దుర్భరమైన జీవితాలు గడిపే వారుంటారు—వారికి చావే విమోచనమార్గం; చావనేది లేకుండా ప్రాణులు పుట్టుకొస్తూంటే వాటికి చోటు కూడా ఉండదు. ఈ మాటలలో సత్యమున్నదని బెప్పో ఒప్పుకోవలసి వచ్చింది. తాను పిలిస్తే తప్ప తన జోలికి రాకుండా మాట తీసుకుని, బెప్పో మృత్యువును సంచీ నుంచి విడుదల చేశాడు.

సంచీ నుంచి విడుదల అవుతూనే మృత్యువు దిగబడిపోయిన తన పనిని గబగబా పూర్తి చేయసాగాడు. ప్రపంచ మంతటా యుద్ధాలూ, విషవ్యాధులూ, ఇతర పీడలూ చెలరేగి, జనం కొన్ని మాసాలపాటు కోట్ల సంఖ్యలో చచ్చారు.

ఆ తరవాత బెప్పో ఎంతో కాలం బతికాడు. అతనికి జీవితం పైనే రోత పుట్టింది. అతని మిత్రులే గాక, వారి పిల్లలూ, మనమలూ కూడా పోయారు.



రాజుగారూ, ఆయన కూతురూ కూడా ఏనాడో పోయారు. అందుచేత అతను, తనను తీసుకుపొమ్మని తన నౌకరు ద్వారా మృత్యువుకు కబురు పెట్టాడు.

"నేనా మనిషి ఉండేచాయలకే రాను!" అని మృత్యువు జవాబు చెప్పాడు.

''ఈ మృత్యువు ఎంత కృతఘ్నుడు! అతన్ని సంచీలోనే ఉంచినట్టయితే రోగం వదిలేది.'' అనుకున్నాడు బెప్పో.

మృత్యువు తన శరీరం నుంచి ఆత్మను వేరుచేయ నిరాకరించాడు గనక తాను స్వర్గానికో, నరకానికో బొందితో పోవటం తప్ప మరొక మార్గం లేదని బెప్పో నిర్ణయించుకున్నాడు. తనకు స్వర్గంలో

చోటుంటుందని అతనికి తోచలేదు. అందు చేత తిన్నగా నరకానికి వెళ్ళి, నరక ద్వారం తలుపులు తట్టాడు.

నరకంలోకి ప్రవేశించగోరేవాడు బెప్పో అనితెలియగానే సైతానుభటులతో, ''వాణ్ణి లోపలికి రానివ్వకండి. బాగా తన్ని ఇక్కణ్ణించి పంపెయ్యండి!'' అన్నాడు.

వాళ్ళు అలాగే చేశారు.

ఇక తనకు స్వర్గం తప్ప వేరే గతి లేదని నిర్ణయించుకుని బెప్పో స్వర్గానికి వెళ్ళి, అక్కడి ద్వారపాలకుడితో తనను లోపలికి పోనివ్వమన్నాడు.

''ఈశ్వరుడు ఏమంటాడో కనుక్కొని వస్తాను,'' అంటూ స్వర్గ ద్వారపాలకుడు లోపలికి వెళ్ళాడు. ఆ సమయంలో బెప్పో స్వర్గం ప్రహరీ గోడ మీదుగా తన టోపీని లోపలి ఉద్యానంలో పడేటట్టుగా గిరవాటు వేశాడు.

ద్వారపాలకుడు తిరిగి వచ్చి, ''నిన్ను ఈశ్వరుడు లోపలికి రానివ్వ వద్దన్నాడు. నువ్వు చేసినఒకే ఒక మంచిపని సైతానును తన్నటం. అంత మాత్రాన నీకు స్వర్గార్హత లేదు. నీ స్థితి, పాపం, విచారకరంగానే ఉన్నది. కాని చట్టాన్ని ఉల్లంఘించటానికి లేదు గద!'' అన్నాడు.

''నిజమే. నేను నా తిప్పలు పడతాను. నా టోపీ లోపల పడిపోయింది. అది కాస్త తెచ్చుకోనివ్వండి,'' అన్నాడు బెప్పో.

''మంచిది. తీసుకు వెళ్ళు,'' అన్నాడు ద్వారపాలకుడు.

బెప్పో లోపలికి వెళ్ళి తన టోపీ మీద కూర్చుని కదలలేదు. ''నా ఆస్తి నే నాక్రమించు కున్నాను. చట్ట ప్రకారం ఆస్తి కన్న పవిత్రమైన దేమున్నది? నన్ను మీరు దీని పైనుంచి కదిలించలేరు,'' అన్నాడతను ద్వారపాలకుడితో.

విషయం ఈశ్వరుడి దాకా వెళ్ళింది.

''స్వర్గంలో అంగుళం మేర దొరికినా స్వర్గమంతా దొరికినట్టే. ఎందుకంటే స్వర్గంలో విభాగాలు లేవు. వాణ్ణి స్వర్గంలోనే ఉండనివ్వండి,'' అన్నాడు ఈశ్వరుడు.



ప్రకృతి వింతలు:

## వేగంగా పెరిగే వెదుళ్ళు



థాయ్‌లాండ్, మలేసియా, ఇండొనేసియా మొదలైన ఆగ్నేయాసియా దేశాలలో విరివిగా కనిపించే ఎత్తయిన వెదురుపొదలు అత్యంత వేగంగా, అంటే—24 గంటలలో ఒక మీటరు ఎత్తు పెరుగుతాయి. మన దేశం ఈశాన్య ప్రాంతాలలోని వెదురు ఏడెనిమిది వారాలలో ఒక కణుపు, అంటే ఇంచుమించు ఒక మీటరు పెరుగుతుంది!

## ముందు హెచ్చరిక!

జరగబోయే ప్రకృతి వైపరీత్యాలను కొంత ముందుగానే గ్రహించగల శక్తి జంతువులకు ఉన్నాయంటారు. ఉదాహరణకు—భూకంపాలు, తుఫానులు, అగ్నిపర్వతాలు బద్దలవడం చేపలు చాలా ముందుగానే గ్రహిస్తాయి. రానున్న తుఫానును జెల్లీ చేపలు 15 గంటలు ముందే గ్రహించి, తీరాలను వదిలి సముద్రం లోతుకు వెళ్ళిపోతాయి. సముద్రం లోతు నీళ్ళలో వున్న చేపలు నీళ్ళ ఉపరితలానికి వస్తాయి! జపానులో తరచూ, భూకంపాలు సంభవించే ప్రదేశాలలో మత్స్య ప్రదర్శనశాలలలోని చేపలు—భూకంపాలు రావడానికి ముందు నిలకడలేకుండా పైకి కిందికీ ఎగిరి పడుతూ దూకుతూ వుంటాయి!

## చెదపురుగుల పర్వతాలు!

కొన్ని చెదపురుగులు పెట్టే పుట్టలు నేల మీద చిన్న చిన్న కొండల లాగా కనిపిస్తాయి. కొన్ని పుట్టలు దాదాపు 21 అడుగుల ఎత్తు వరకూ పెరుగుతాయి. అతి చిన్న పరిమాణం గల చెదళ్ళకు ఈ పుట్టలు హిమాలయ శిఖరాల్లా కనిపిస్తాయి!



# GET OFF TO A FLYING START *with*



LPP LTD • PREMIER • 261 • HB •

LION
## PREMIER® HB PENCILS

Supersmooth for effortless writing. Micronized lead for unbreakable points. Grace the desks of executives and others with style.

LION
## *PINKY*® PENCILS

Perfect classmates. Pretty & Practical. Colourful designs, strongly bonded lead for unbreakable points, give it an edge over the competition.








LION *Gee-flo*® BALLPENS
**035 carbine** **050 carborite**

**Tungsten carbide tips.**
Made with Swiss technology.
Unbeatable points. Sharp. Smooth. Non-smudging. Race across the page. Choice of red, black and blue refills. Mini-marvels at a marvellous price.






**LION PENCILS LTD.**
**95, Parijat Marine Drive, Bombay 400 002.**




**OFFICIAL LICENSEE OF THE WORLD CUP**

National-766

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1992 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



Pramod Bhanushali



I. Umarani

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మే నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: అందినదా అంబరం?

రెండవ ఫోటో: చూశావా ఆ సంబరం!

పంపినవారు: పి. పూజ, D/o పి. ఎల్. ఎస్. రావు (అడ్వకేట్) స్టేషన్‌రోడ్ ఖమ్మం—507 001

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---